

పంచతంత్రం

# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి



పూర్వమొకప్పుడు ఇంద్రనగరిలో సుమకోమలమను చిలుకొకటున్నది. సకల శాస్త్రముల పండితురాలగు ఆ చిలుకెంతో ముచ్చటగొలిపేది.



రోజూ చిలుకను దేవేంద్రుడు తన ఎదుటకు పిలిచి గంటలకొద్దీ కాలక్షేపం చేసేవాడు ఆ చిలుకంటే దేవతలంతా ఎంతో ప్రేమగ వుండేవారు.



ఒకనాడింద్రుడు చిలుకతో ఏదో మాటలాడుతూ వుండగనవటికి వచ్చాడెందుకో యమధర్మరాజు యముని చూడగనె భయపడి చిలుకా వణుకుతు చాటున దాక్కుంది



ఇది గమనించిన దేవతలంతా చిలుకను చేరి అడిగారు: "సకల విద్యలూ తెలిసిన నీవే యముని చూచి భయపడ్డావేలా?"






చిలుక భయమునూ తొలగించుటకై, దేవతలప్పుడు యముడిని చేరి "ప్రాణసమానం మాకో చిలుకా దీనికి చావే లేకుండా ఒక వరమి"మ్మంటూ అడిగారు



"చంపుటమూ, మరి చంపకుండుటము నా యిష్టంలో లేదర్రా. ఈ విషయంలో కాలపురుషుడే నిర్ణయించగా సమర్థుడు అతనినే పోయీ వేడరండి"



కాలపురుషునే వద్దకు పో... చిలుకను కావగ వేడారు. "ఎబ్బెబ్బే! నాదేముందర్రా పెత్తనమంతా మృత్యువుదేకదా! అతనినె పోయీ అడగండి!"



చిలుకను కూడా వెంటబెట్టుకుని మృత్యువు వద్దకు వెళ్ళారు



మృత్యుదేవతను చూడగానె ఆ కీరం ప్రాణం విడిచింది!



దేవతలప్పుడు యముని వద్దకే పోయి ఇట్టులా అడిగారు "ఏమండీ యీ చిలుక చావుకూ కారణమేమో చెప్పండి!"




చిలుక చావుకై ... దేవతలంతా ము... ల్లుకు తమ తమ యిళ్ళకు వెళ్ళారు



| సంవత్సర చందా |
|---|
| రు. 12-0-0 |
| విడిపత్రిక 4 అ. |




సచిత్ర వారపత్రిక

Founder : K. NAGESWARA RAO

| సంపుటము 45 |
|---|
| సంచిక 9 |
| **22.10.52** |

నందన కార్తిక శుద్ధ చవితి బుధవారము





చైనాలో తాయ్ షాన్ అనే కొండమీదగల దేవాలయపు ముఖద్వారం—అమెరికన్ చిత్రకారిణి మిస్ అగస్టామలికిన్ టెంపెరా రంగులలో చిత్రించిన ప్రతికృతి. ఈమె చిత్రాలు సుమారు 70 దాకా ఈ నెల 12-వ తేదీన సౌత్ ఇండియన్ పెయింటర్సు సంఘం అధ్వర్యాన మద్రాసు మ్యూజియం హాలులో ప్రదర్శించబడ్డాయి. చీఫ్ జస్టిస్ రాజమన్నార్ ప్రదర్శనం తెరిచారు. 25 ఏళ్లపాటు చైనాలో గడిపిన మిస్ మలికిన్ నూనె రంగులు, టెంపెరా, చాక్, బొగ్గు మొదలైన అన్ని మీడియములలోను ముఖ్యంగానూ నెరంగులలోను చక్కని పాండిత్యం ప్రదర్శించింది.

# విషయానుక్రమణిక

# కాలక్షేపం

"ఆ జాబిల్లి వెలుంగు వెల్లువల, డా
యన్ లేక రాకానిశా
రాజశ్రీ సఖమైన మోమున పటా
గ్రం బొత్తి ఎల్గెత్తి, యా
రాజీవానన యేడ్చె, కిన్నరవధూ
రాజత్కరాంభోజ కాం
భోజీ మేళవిపంచికారవసుధా
పూరంబు తోరంబుగాన్."

పండువెన్నెలలో విరహవేదన భరించలేక (బహుశః తన ప్రమదావనంలో) విహరిస్తోంది. ఆ చల్లని చంద్రుని కాంతివెల్లువలను భరించలేక, నిండుపున్నమ చంద్రునితో సమానమైన తన మోమున (ముఖమునకు) తన చీరె కొంగును ఒత్తిపట్టి (అనగా ముఖమును చీరెకొంగుతో మూసికొని) ఆ రాజీవానన—(ఆ చంద్రముఖి) ఎల్గెత్తి (పెద్ద గొంతుకతో) ఏడ్చింది. కిన్నరకన్య కరాబ్జములో విరాజిల్లుచుండేటువంటిన్నీ, కాంభోజీరాగమునకుగాను తీగెలు శ్రుతి చేయబడినటువంటిన్నీ వీణాస్వర సుధారస ప్రవాహంబులాగున ఆమెయొక్క ఏడ్పు ధ్వనించింది.

ఈ విధంగా గిరికాదేవి విరహవేదన అనుభవించినదని వసుచరిత్రలో రామరాజభూషణుడు వర్ణించాడు. ఈ మహాకవి కృష్ణదేవరాయలవారి ఆస్థాన కవులలోనివాడు. ఆనాటి ఆంధ్రసాహిత్యంలో అపశ్రుతి అనేది కన్పించదు అని ఘంటాపథంగా చెప్పడానికి, తార్కాణాలు చూపించవచ్చు. ఎందుచేతనంటే ఆనాటి కవుల ప్రబంధాలలోని నాయిక ఏడ్చినప్పుడుకూడా శ్రుతిబద్ధంగా శ్రావ్యంగా ఏడ్చింది. అందులోకూడా అపశ్రుతి కన్పించదు. కాంభోజిరాగం, నాటరాగం, సావేరిరాగం, బేగడరాగం యివి సాయంత్రము 6 గం॥ మొదలు రాత్రి 9 గం॥ల వరకు రక్తిగా పాడదగిన రాగాలని మన సంగీతశాస్త్రంలో చెప్పబడి ఉంది. కనుక యీపద్యంలోని నాయికయగు గిరికాదేవి సాయంత్రము 6 గం॥లు 9 గం॥ మధ్య తనపూలతోటలో విహరిస్తూ, తన ప్రియుడు తనకింకా లభించలేదనే విచారంతో కాంభోజిరాగంలో

"ఏమీ మాయము చేసిపోతివో
శ్యామా సుందరా!"

అనే బాణీలో ఒక విషాదగీతం చక్కని సన్నని గొంతుతో వీణె తీగెలు మ్రోగినట్లుగా పాడిఉండవచ్చు.

ఏ రాగం ఏ వేళలో ఆలాపన చేయవలెనో సంప్రదాయసిద్ధమైన నియమనిర్ణయం ఒకటి ఉంది. కాంభోజీరాగం రాత్రిసమయంలో సుమారు 9 గంటలపూర్వం ఆలాపన చెయ్యవలెనని ఒక నియమం వుంది—ఈ నియమం పాటించడంవల్ల ఒక్కొక్క రాగంవల్ల ఒక్కొక్క రసోత్పత్తి ఆయా వేళలందు కలుగుతుంది అని కొంత తత్వవిచారణ చేసిన పూర్వులు నిర్ధారణ చేశారు. ఆయా స్వరముల కలయికవల్లను ప్రస్తారంవల్లను ఒక్కొక్కవిధమైన భావోద్రేకం కలుగడానికి అవకాశం ఉంది. అటువంటి భావోద్రేకం ఒక్కొక్క వేళలో మరింత ఎక్కువగా కలిగి ఆ రాగముయొక్క రసానుభవం మనకు పూర్తిగా కలుగుతుంది. మానవ చిత్తప్రవృత్తియొక్క లక్షణాలను కూడా శోధించి పరిశీలించిన పెద్దలు ఆ విధంగా నిర్దేశించారు. కాని, ఆయా రాగాలను పెద్దలు నిర్ణయించినటువంటి ఆయా ప్రత్యేక వేళలందు కాకుండా యథేష్టంగా మనకు ఇష్టమైన వేళలో మనము పాడుకోకూడదా? ఎవరైనా ఆ విధంగా పాడితే మనము వినకూడదా? అనే ప్రశ్న సహజంగా సత్యాన్వేషకులైనవారు అడుగవచ్చు. ఆయా రాగాలకు ఆయా వేళలు ప్రత్యేకంగా నిర్ణయింపబడి ఉన్నాయనిన్నీ వేళకాని వేళలో ఒక రాగం వినిపించడం గాని పాడడం గాని కూడదనిన్నీ అల్లసాని పెద్దన్నగారుకూడా అంగీకరించారు. వీరు కూడా కృష్ణదేవరాయల వారి ఆస్థానంలోని గొప్ప పండితులు, కవులు. పెద్దన్నగారు రచించిన మనుచరిత్రలో యీ క్రింది పద్యం చూడండి—

"వాలారుం గొనగోళ్ల నీ వలసతన్
వాయించుచో నాటకున్
మేళంబైన విపంచి నిన్న మొదలున్
నీ వంటమిం జేసి యీ
యాలాపంబె యవేళ బల్కెడు, ప్రభా
తాయాతవాతాహతా
లోలత్తంత్రుల; మేళవింపగదవే
లోలాక్షి దేశాక్షికిన్."

తెల్లవారింది. కాని, నాయిక యింకా అంతఃపురంలోనే పవళించి ఉంది. అందువల్ల ఆమెను అతి సుకుమారంగా, సొగసైన మాటలతో నిద్రలేపుటకై చెలికత్తె పైరీతిగా పలికింది.

"నాటరాగానికై నిన్న నీవు వీణెయొక్క తీగెలను శ్రుతిచేశావు. నీ కొనగోళ్ళతో అలసతన్ వాయించి నిద్రపోయినావు. నిన్న మొదలున్ నీవు ఆ వీణెను అంటకపోవుటవల్ల, యిప్పుడు యీ తెల్లవారుజామున కూడా ఆ వీణెతీగెలు ఆ నాటరాగమునే వేళకానివేళ (అవేళ) పల్కుతున్నాయి. ఏవిధంగా పల్కుతున్నవంటే, ప్రభాతకాలమందు వచ్చుచున్న గాలిచేత ఆ తీగెలు కొట్టబడినవై నాటరాగమును వేళ కాని వేళ పల్కుతున్నవి. కాని యీ తెల్లవారుజామున ఆలాపన చేయవలసినటువంటి దేశాక్షిరాగానికి అనుకూలంగా ఆ వీణె తీగెలను మేళవింపగదవే ఓ లోలాక్షీ!" అని ఆ చెలికత్తె సంబో

ధించిచాలా గడుసుగా వయ్యారంగా "తెల్లవారింది - ఇంకా నిద్ర ఏమిటి? లే! లెమ్మ!" అని హెచ్చరించింది. నాటరాగము సాయంకాలము 6 గం॥ మొదలు రాత్రి 9 గం॥ వరకు పాడుకొనవలసిన రాగం అని మన సంగీతశాస్త్రంలో ఉంది. కాబట్టి పై పద్యంలోని నాయిక రాత్రి 9 గం॥ వరకు నాటరాగం ఆలాపన చేసి 9 గం॥ కు నిద్రపోయి ఉంటుంది. దేశాక్షిరాగం అని యీ పద్యంలో చెప్పబడిన ఈరాగాన్ని దేవాక్షిరాగం అనికూడా అంటారు. దేవాక్షి, ధన్యాసి, దేవగాంధారి, భూపాలము, యీ రాగములు తెల్లవారిజామున 3 గం॥ మొదలుకొని ప్రాతఃకాలము 6 గం॥ వరకు పాడుకొనవలసిన రాగాలని శాస్త్ర సంప్రదాయమై ఉంది.

కాబట్టి ప్రాతఃకాలము 6 గం॥కు పూర్వమే నాయికను నిద్ర లేపుటకై చెలికత్తె వచ్చినదని అర్థం చేసుకోవాలి. 6 పురుష రాగాలు ఉన్నాయి. ఒక్కొక్క పురుష రాగానికి మూడేసి స్త్రీరాగాలు భార్యలుగా చెప్పబడి ఉన్నాయి. నాట రాగం, పురుష రాగం అనిన్నీ, దానికి ఘంటారవం, కాంభోజి, శంకరాభరణం అనే 3 స్త్రీ రాగాలు భార్యలై యున్నవనిన్నీ సంగీతశాస్త్ర సంప్రదాయం.

ఆనాటి రాణివాసంలో ఎంత ప్రొద్దుపోయిన తర్వాత నిద్రపోయేవారో, ఎంత ప్రొద్దెక్కిన తర్వాత నిద్రలేచేవారో, ఆ చర్చ మనకు అవసరం లేదు. ఈకాలంలో అయితే, "అమ్మగారూ! కాఫీ కాచి తెచ్చాను! చల్లారిపోతోంది, లేచి తాగుతారా?" అని పరిచారిక అడుగవచ్చు. కాని, ఆనాటి రాయలవారి కాలంలో ప్రబంధకాలంలో కాఫీ అభ్యాసం లేదు - కాని కాఫీరాగం గుచిమాత్రం వారికి తెలుసు - ఆయా రాగాలు ఆలాపన చేయడానికి తగినట్లుగా, వీణె తీగెలను ఒక్కొక్క రాగానికి ఒక్కొక్క విధంగా శ్రుతిచేసిన మాట నిజమే అయినట్లయితే,—ఆయా రాగాలను ఆయా వేళలందు నియమబద్ధంగా వారు పాడుతూఉండినట్లయితే, వారి సంగీతం, వారి జీవితంకూడా కొంత శాస్త్రకట్టుగా నేఉన్నదని ఊహించవచ్చు.

శబ్దసిద్ధి లోకంబువలన దెలియును. శాస్త్రంబు నియమముకొరకు అని వ్యాకరణంలో మొట్టమొదటి మూలసూత్రం ఒకటి ఉంది.

శబ్దం ఎట్లా పుట్టిందీ అంటే లోకంలో దానికి ఉన్నటువంటి వాడుకను గమనిస్తే తెలుస్తుంది. ఆ శబ్దాన్ని అందరూ ఉపయోగించాలి. ఒక్కొక్క రొక్కొక్క మాదిరిగా దానిని ఉచ్చరిస్తే, ఒక్కొక్క రొక్కొక్క అర్థంలో ఉపయోగిస్తే, ఒకరి మాట ఇంకొకరి కర్థం కాదు. ఒకే మాటను నాలుగైదు విధాలుగా

(48-వ పేజీ చూడండి)

# సంసారమ్

సంసారమ్ అనేసరికి, — సంస్కృతమ్ వాసనవున్నవాళ్లు "సంసారమ్ సాగరమ్ దుఃఖం" అని ఠక్కున అనివేస్తారు.

తదితరులు "సంసారం వుందే అది దరిలేని సముద్రం; దాన్ని యీదడానికి యెవడితరం" అంటారు.

అసలు మన వేదాంతులు, మతగురువులూ మఠాధిపతులూ — యీ సంసార జీవనంమీద యెంతయినా వ్యతిరేక ప్రచారం సాగించారు. బ్రహ్మచర్యాశ్రమంనుంచి వొక్కమారుగా అటు వైరాగ్యంలోకి యెకాయెకి వొకేవొక గంతు వేసినవారు సరే,—కొంతకాలం 'సంసారం సాగించి,' యేదో ముక్తసరిగా ధర్మరీత్యా యెంత అనుభవించాలో అంతతోనే తృప్తిపడక సమాజపు యెల్లలు నియమాలూ అతిక్రమించి సంసారసుఖాలు అనుభవించినతరువాత సన్యసించినవాళ్లున్నారే - సంసార జీవనముమీద సాగించిన వ్యతిరేకప్రచారం యెంత విపరీతమయిందో వ్రాయడానికే వీల్లేదు!

'సంసారబంధంలో చిక్కుబడ్డవాడు గిజగిజ తన్నుకొని చావవలసిందేగాని మరి బయటపడలేడు' అంటూ వొకటే కొట్టి పారవేయడం కొట్టి పారవేస్తారు - చివరి దశలో వైరాగ్యం పుచ్చుకున్న ఆ మాజీ సంసారులు.

* * *

సంసారం అంటే ప్రపంచం అని వొక అర్థం చెబుతారు. అరవ సోదరుడు "యంగళ్ సంసారమ్" అంటాడు; కొందరి దృష్టిలో ప్రపంచంగా అర్థం చెప్పకోబడుతున్న "సంసారా"నికి అరవ సోదరుడు "నా భార్య" అన్న దృష్టితో మాట్లాడుతూ వుంటాడు.

అంటే అతని దృష్టిలో భార్య బ్రహ్మాండమంతటిదా?

* * *

సంసారానికి వేదాంతులు దైవచింతన గలవారు చెప్పే అర్థం అలా వదలి చూస్తే మాత్రం సంసారం అనేది వొక మహత్తర వ్యవస్థ. అది సాగరంకన్నా విశాలమయింది; గభీరమయింది; అగాధమయింది; ఆనందదాయకమయింది. బాధాకరమయింది.

సంసారంలో లేనిదేమిటి? - సుఖం - దుఃఖం; దానం ధర్మం, న్యాయం అన్యాయం; కామం క్రోధం; దయ దాక్షిణ్యం, క్షమాక్షాత్రం, భోగంత్యాగం అన్నీ సంసారంలో వున్నాయి.

* * *

. వేదాంతులు మున్నగువారు సంసారమంటే విపరీతంగా విమర్శచేస్తారే గాని యీ సంసారపు వ్యవస్థా, సంసారులూ లేకపోతే - సమాజంలోని వొక భాగమైన సన్యాసులు, భిక్కులు, వేదాంతులు వికలాంగులు, యిటువంటి వారందరికీ రోజుకు వొక్కపూట వంతునైనా అమరవలసిన అశనం యెలా అమురుతుంది?

అందుచేతనే మన ం సంసారాన్నీ సంసార జీవవాన్నీ తీవ్రంగా విమర్శ చెయ్యవద్దు. వాళ్లు సాగరమనే ఆ సంసారాన్ని మథిద్దాం. దానిలో అమృతమే వున్నదో హాలాహలమే వున్నదో తెలిసికొనడానికి ప్రయత్నిద్దాం.

* * *

సంసారం ప్రకృతిలోని వొక అంశం. దాన్ని మానవుడు తనకు యిష్టంవచ్చిన పద్ధతిలో సరిదిద్దుకుంటాడు. దేశకాల పాత్రలను అనుసరించి రూపురేఖలను నిర్ణయించుకుంటాడు. ఐతే యీ రూపురేఖలను రచించే సందర్భంలో వ్యక్తుల స్వార్థమే ప్రధానస్థానం పొందగలిగితే దానికి వ్యక్తులు ఛిన్నాభిన్నాలయి పాకొవచ్చు; లేదా వారే ధర్మమే ప్రధానంగా భావించి నిర్ణయాలు చేసేలావుంటే సమాజంలోని ప్రతీవ్యక్తీ సుఖపడనూ వచ్చు; తృప్తిపొందనూ వచ్చు.

* * *

ఇంటగెలిచి రచ్చగెలవాలంటారు. దీనిలో సత్యం వుంది. ఏమంటే సంసారమనేది అతిచిన్నదైన వొక చిన్నకూటమి. ఈ కూటమిలో స్త్రీలు, పురుషులు, వృద్ధులు, బాలబాలికలు, పనిచేసేవారు—అంతా వుంటారు. ఒక సంసారంలోవున్న వ్యక్తులందరూ వొకేలా వుండరు; వారి మనస్తత్వాలూ, అభిరుచులూ, వర్తనలూ వేరువేరుగా వుంటాయి. అటువంటి సందర్భంలో వారందరినీ అర్థంచేసికోగలిగినవాడు- అటువంటి వ్యక్తికి - యింటిలోనే కాదు - రచ్చలో కూడా పలుకుబడి యేర్పడితీరుతుంది. ఎందువల్లనంటే సంసారంలో కొంత శిక్షణా అనుభవమూ పొందగలిగిన వ్యక్తి తన అనుభవాలను బయట రచ్చసావడిలో కూడా ప్రయోగించి జాగ్రత్తతో మెలగుతాడు. అటువంటివాడు రచ్చసావడిలోని వారినికూడా అవగాహన చేసికొని తన కనుకూలం చేసికుంటాడు. అతని భావాలనో అభిప్రాయాలనో, అభిమతాన్నో రచ్చసావడిలోనివారు శిరసావహిస్తారు. ఇదే పద్ధతిలో ఈ వలయాన్ని విపులీకరిస్తూ వెళ్తే గ్రామం, గ్రామంనుంచి జిల్లా, - జిల్లానుంచి రాష్ట్రం, రాష్ట్రంనుంచి దేశం, దేశంనుంచి ఖండం, ఖండంనుంచి ఖండ ఖండాంతరాలవరకూ సంసారములోని అనుభవాన్ని పునాదిగా తీసికొని విజయం పొందుతూ ముందుకు వెళ్లవచ్చు.

నన్నడిగితే యిదే భావాన్ని ఆధారంగా తీసుకుని యిదివరకు ఆదిలో నానాజాతి సమితి స్థాపనాయత్నమూ ఆ తరువాత ఐక్యరాజ్యాలసమితి స్థాపనా - యివియన్నీ జరిగాయంటాను.

* * *

సంసారాలనుంచి సంయుక్త రాజ్య స్థాపనోద్దేశంవరకూ మాట రావడంచూచి- యిది యేదో రాజకీయపు సుడిగుండంలో పడిపోతూవున్నాడే అని పాఠకులలో కొంతమంది విసుగుచెందుతారేమో! అటువంటి భయమేమీ మీకు అక్కరలేదు.

అసలు మూలస్థానేశ్వరుడైన సంసార వ్యవస్థయే అంతు తెలియనిదై వున్నప్పుడు దాని మంచి చెడ్డలు మనుగడలు, తీరులు తెన్నులు—యివన్నీ యెలా వుంటవో తెలిసికొనడానికి యత్నించకుండానే ఇతరములవైపు చేతులు చాచడం?—ఉట్టికి యెగురనమ్మ స్వర్గానికి యెలా యెగురుతుంది?

సంసారం అనేసరికి అది పట్నవాసపు సంసారమా పల్లెటూరి సంసారమా? పేద సంసారమా ధనికసంసారమా? అతుకు బ్రతుకుల సంసారమా ఆకతాయి సంసారమా? దేనినిగురించి యెత్తుకుంటారు అని పిస్తుంది.

ఇటువంటి సందేహం కలగడం సహజం. సంసార మన్నది దరీ అంతూ లేని మహా వ్యవస్థ. దానికి యెన్నో రూపాలు,

(౧౩-వ పేజీ చూడండి)



తెర ఎత్తగానే కుర్చీలో ఓ అందమైన అమ్మాయి మౌనరాగంతో కనిపిస్తుంది. పత్రిక తిరగేస్తూవుండగా బయట తలుపు ఎవరో తట్టుతారు.

సుమిత్ర: ఎవరు? (లేచి తలుపు తీస్తుంది) ఓహ్హో! ఏమిటీ విచిత్రం!

లీల: (వస్తూ) ఎందుకో!

సుమిత్ర: అన్నయ్యా నువ్వూ కలసి ఒక్కమాటే రావడం. అన్నయ్యకి ఈవాళ యిక్కడికి వచ్చేటంత తీరుబాటెలా కలిగిందో ఆశ్చర్యమే!

ప్రకాశరావు: నే నెప్పుడూ తీరుబాటుగానే వుంటాను.

లీల: ఇహానించి శాశ్వతంగానూ.

సుమిత్ర: ఏం?

లీల: ఉద్యోగానికి ఫుల్ స్టాప్.

సుమిత్ర: ఏమిటీ! ఉద్యోగం పోయిందా?!

లీల: అంతకంటె యెక్కువైందే...... అసలు నాకు తెలీ కడుగుతాను. ఈయనేదో ఆ మిల్లులో పనిచేస్తున్నారు. వాళ్లా ఏదో నెలకి యింతా అంతా యిస్తున్నారు. అది తిని తన మానాన తాను పోకండా వాళ్ళమీద రాతలు కోతలు సాగిస్తారా ఎవరైనా?

సుమిత్ర: ఏం రాతలు?

లీల: అసలు ఏం రాతలో, ఈయనకి తోడు ఆ 'సత్యవాది' సంపాదకు డొకడు.

ప్రకాశరావు: అతన్నెందుకు అనవసరంగా అనడం?

లీల: ఎందుకా తోడుదొంగలు కాబట్టి. రేపొకే నేదో కోర్టువరకూ వస్తే అప్పుడు ఈ స్నేహాలు, జర్నలిజాలు భేషజాలు...

సుమిత్ర: కోర్టు కెందుకు?

లీల: ఉన్నవీ లేనివీ సృష్టించి ఆ మిల్లు అధికారులమీద పత్రికల్లో వ్రాసినందుకు.

సుమిత్ర: ఏమని?

లీల: మొట్టమొదటనించి నేను మొత్తుకొంటూనే వున్నాను. మన కా తలకు మించిన పను లెందుకు, ఒకవేళ కాళ్ళ తాడు కంఠానికి చుట్టుకొంటె విడిపించు కోనేందుకైనా తాహతు మనకి లేదని, విన్నారా—

సుమిత్ర: అసలు ఏం జరిగిం దేమిటి వదినా?

ప్రకాశరావు: నీ మాట వినిపించు

**శ్రీ ఎస్. ఆర్. నంది**

కొంటుం దేమిటే? తన గొడవంతా పూర్తి కానిది ఎవర్నీ లెఖ్ఖ చెయ్యదు.

లీల: అవును యెవరినైనా ఎందుకు లెఖ్ఖ చెయ్యాలి? మీలా నేను మనస్సులో మాటని దాచుకోలేను. అనుకున్న దాన్ని ముఖంమీదే అనేస్తాను.

ప్రకాశరావు: అని అనుకొంటు న్నావ్. కాని నిజానికి నీ కా మాటలు కంఠంపైనించే వచ్చాయి, కడుపులోంచి రాలేదు.

లీల: అవును నా మాటలు కడుపులోంచి ఎలా వస్తాయి? మీరంటె కవులు, రచయితలు గాబట్టి నిజాన్ని బయటపెట్టి, చెప్పుదెబ్బలు వెంటనే తింటారు.

ప్రకాశరావు: (నవ్వి) నిజం చెప్పావ్. నీకూ నాకూ అక్కడే భేదం. నీకు లోకంతో, లోకుల మాటలతో పని. అందుకోసం అందులో ఎంత కుళ్ళున్నా చచ్చినట్టు ఆ హ్యాయంగా అనుభవిస్తావ్; ఎందుకు? నీకు కావలసింది పైపై మెప్పులు, గౌరవాలు.

లీల: చూశావా సుమిత్రా ఆ వేదాంతం! నేను ఏదైనా వద్దని సలహా యిస్తే ఈ తీరులోకి దిగుతారు.

ప్రకాశరావు: నువ్వు నాకు అసలైన సలహా యిచ్చివుంటె నేను చేసిన పనికి



మెచ్చుకొనే వుండేదానవ్. అసలు జరిగిన సంగతి యిది సుమిత్ర: దేశంలో ధరలు పడిపోయాయి. ఇంతవరకు ప్రజల్ని జలగల్లా పీల్చి చంపుతున్న వర్తకులు, ఉత్పత్తిదారులు ఈ దెబ్బతో తారెత్తి వున్న సరుకుని దాచేయడం మొదలుపెట్టారు. ఇంకా లాభంలేక పనివాళ్ళని పనినించి తీసేస్తున్నారు. అసలే వాళ్ళు బీదవాళ్ళు. ఈ పనులు పోతే యెక్కడకు పోతారు? నువ్వే ఆలోచించు...ఇదీ అసలు విషయం. దీన్ని నేను వ్యాసరూపంలో పత్రికలో ప్రకటించినందుకు అధికారులకి కోపం వచ్చింది. చూడు, తనదగ్గర పనిచేసేవాడు అంతపనీ చేస్తే ఎవరూరుకొంటారు? నన్ను సస్పెండ్ చేశారు- రేపు ఎల్లుండిలో కేసు పెడతారు.

సుమిత్ర: ఐతే ఏమవుతుంది?

లీల: చేతికి భిక్షాపాత్ర.

సుమిత్ర: ఛా! ఏమిటి వదినా ఆమాటలు!

లీల: అంతకుమించి మరేముంది చెప్పు? ఆయన ఆస్తంతా కలసి ఆ మంచం, టైంపీసు, పుస్తకాలేనా? అలాంటి ఎలకలకి కొండలతో యుద్ధమేమిటి చెప్పు?

ప్రకాశరావు: మరి ఆ కొండల కిందేనా యిన్ని లక్షల ఎలకలు ఛస్తున్నాయి?

లీల: ఆఁ ఏవి, ఎక్కడ ఛస్తున్నాయో చూపించండి? లోకంలో మనుషులందరు ఎలా బ్రతుకుతున్నారు...

ప్రకాశరావు: మామూలుగానే మానవత్వాన్ని చంపుకొని.

లీల: మీ రెంతో మహా మానవత్వాన్ని తెలుసుకొని మసలుతున్నట్టు? అసలు వీళ్ళకి కాస్త పత్రికల్లో రాసేంత జ్ఞానం కలగ్గానే *Pessimistie Views* పుట్టుకొస్తా యెందుచేతో!

సుమిత్ర: ఇప్పటి లోకం పోకడ అంతే కదు వదినా - దాన్ని సరిగ్గా అర్థం చేసుకొంటె నువ్వూ పెసిమిస్ట్‌వే అవుతావు.

ప్రకాశరావు: అలా బుద్ధిచెప్పు...పీక నరుకుతున్నా తల వంచమంటుంది.

లీల: అవును లోకమంతా ఏదారినపోతే ఆదారినే మనమూ పోదాం. ఈవాళ పైపైకి మిమ్మల్నీ నన్నూ పొగుడుకు తిరిగే వారే రేపు మన పరోక్షాన గోతులు తవ్వుతారు. ఈ స్నేహాలవల్ల ఎన్ని కొంపలు కూలిపోయాయి, ఎన్ని సంసారాలు నాశనమైపోయాయి...

ప్రకా: ఐతే యింతకీ నీ ఉక్రోష మంతా 'సత్యవాది' సంపాదకుడు మీదన్నమాట,

లీల: ముమ్మాటికీ, అతనిలో మీకు ఏ గొప్పలు కనిపించాయో నా కనవసరం, నా క్కావలసింది మనిషి తీరు.

ప్రకా: అతని తీరు నిన్నేం చేసింది?

లీల: నన్నే కాదు, సంఘ మని పేరు చెప్పి, దాన్ని ఉద్ధరించాలని డబ్బాలు కొడుతూ చేతా వాతా కాని వ్రాతలతో అమాయక ప్రజల్నందర్నీ మోసపుస్తున్నారు.

ప్రకా: (నవ్వి) అవును, నీ అసూయ యితరులమీద యెలాంటి అభాండాలనైనా వెయ్యడానికి వెనుదియ్యదు.

లీల: అసూయ! నాకే కదూ? సంఘాచారాలమీద దుమ్మెత్తిపోసే ఆ పెద్దమనిషి మామగారినించి కట్నం పదివేల వరహాలు వసూలు చెయ్యలేదూ? ఆడదిచ్చిన కట్నం సొమ్ముతో ప్రెస్సు పెట్టి పత్రిక నడిపే మనిషీ ఓ సంపాదకుడే అన్నట్టు మాటాడుతారేం?

ప్రకా: వినబట్టేనా వాగుడు!

లీల: ఏం, ఈ వాగుడులో అబద్ధముందా?

సుమిత్ర: పోనీ ఆ విషయం విడిచిపెట్టు వదినా.

లీల: అబ్బే, కాదు చెబుతున్నాను. ఇలాంటి వాజమ్మలందరూ సంపాదకులై, నీ, నా భేదం లేకండా...(మాట మార్చి) అసలు అతను నిజమైన సంపాదకుడైతే ఈయనగారు యిన్ని రచనలు అందులో వ్రాశారు కదా ఒక్కసారైనా పిలిచి ప్రతిఫలంగా యింత యిచ్చిన పాపాన పోయాడా? ఆ పత్రికమీద వచ్చిన లాభాలు బ్యాంకుల్లో పెరుగుతాయా? అదేమంటె పత్రిక్కి ఆర్థికస్తోమత లేదంటారా?

ప్రకా: అదుగో విను సుమిత్రా! ఈవిడ అసలు రంగు బయటపడుతోంది. ఈవిడకు యిరవైనాలు గ్గంటలు ధ్యానం డబ్బు డబ్బు డబ్బు.

లీల: చాల్లెండి సిగ్గు లేకండా మాటాడుతున్నారు. ఎదుటవాళ్ళని విమర్శిస్తే తమ తప్పులు తప్పకపోతవని. మరి మీ రా పత్రికలకి వ్రాయడం పేరుకోసం కాదు?

ప్రకా: అవును నువ్వ నన్నంతే అర్థం చేసుకోగలవ్.

గోపాలరావు: (వస్తూ) ఏమిటోయ్ చాల వేడి వాదనలు జరుగుతున్నాయ్ - కొంపతీసి మరో 'ప్లాట్' కాదుకదా?

సుమిత్ర: ఆఁ అలాంటిదే-మీరొక్కరే తక్కువని ఎదురుచూస్తున్నాం.

గోపా: ఆలాగా? అసలు ఈ రచయితలు మా గుమ్మంలోకి అడుగు పెడితేనే వణుకు పుట్టుకొస్తుంది. పైగా మాలో ఎలాంటి చిన్న లొసుగు కనిపించినా యింతంత రాద్ధాంతం చేస్తారు.

ప్రకా: ప్రతీ చిన్న విషయాన్ని పత్రికలకి వ్రాసేంత నీచస్థితికి రాలేదులే డాక్టర్ నీ పుణ్యాన,

లీల: అంతకంటె పెద్ద విషయాలని నీచానికి లాగే స్థితిలోకి వచ్చారు.

# బోలుమనుషులు

ప్రకా: నీకు తెలీని విషయాలు మీద వేసుకోకు లీల. నీకు ఎన్నో సార్లు హెచ్చరించాను...

లీల: అవును నే నెవర్నీ లెండి......

(నిష్క్రమణ)

గోపా: (క్షణం నిశ్శబ్దం) టీ తీసుకరా సుమిత్ర, మళ్ళా బయటకి వెళ్ళాలి.

సుమిత్ర: మళ్ళా ఎవరికి మొచ్చింది?

గోపా: ఓ గొప్ప ధనవంతుడికి కడుపులో నొప్పొచ్చింది. త్వరగా వెళ్ళాలి.

సుమిత్ర: డాక్టర్ల బ్రతుకులే యింతే!

(నిష్క్రమణ)

గోపా: ఆఁ...ధనవంతుడంటె జ్ఞాపకం వచ్చింది...ప్రకాశం నీ వ్యాసాన్ని 'సత్యవాది'లో చదివాను...

ప్రకా: చదవడానికేగా వ్రాశాను!

గోపా: అవు నందుకేలే. అయితే అందులో విషయాలని ఋజువు చెయ్యగల శక్తి వుందా?

ప్రకా: లేకండా ఆ వ్యాసాన్ని వ్రాయడానికి యెన్ని గుండె లుండాలి? అంకెల వివరాలతో సహా ఈవారం ప్రచురిస్తాను.

గోపా: కాని యిది నీ తలకి మించిన పనేమో?

ప్రకా: ఐనా నాకు ప్రజాబలం వెనక వుంది.

గోపా: ఆ వ్యాసాన్ని యెవరికోసం వ్రాశావ్?

ప్రకా: న్యాయాన్యాయాల్ని విచారించే అధికారులకోసం, నిజానిజాలని తెలుసుకొనెందుకు కూలీలకోసం.

గోపా: మంచిదే; నిజానిజాలని తెలుసుకొనగోరే కూలీల్లో ఎందరికి చదువొచ్చు, ఎందరీ పత్రికను చూసుకొంటారు?

ప్రకా: అందరూ చూస్తారు. చూసిన వాళ్ళు మిగతావాళ్ళకి చెబుతారు.

గోపా: (అర్ధోక్తిలో) వాళ్ళు వెంటనే మరచిపోతారు! చూడు ప్రకాశ్: మనం అనుకొనేంత సులభమైంది కాదు లోకం. మనం ఆశావాదులం కాబట్టి పూర్తిగా ప్రయత్నిస్తే ప్రతీసమస్యా యిట్టే పరిష్కరింపబడుతుం దనుకొంటాం. కాని నా అనుభవాన్ని బట్టి చెబుతున్నాను- యివన్నీ వూహావాదాలేగాని నిజమైనవి కావు. వీటిమీది విజయాన్ని సాధించాలంటే మన స్తత్వాలని ముందుగా సంస్కరించాలి... ఐతే యిప్పుడీ విషయం కోర్టువరకు వస్తే ఫలితం?

ప్రకా: నిజం తేలిపోతుంది.

గోపా: ఇంకా ఆ ఆశావాద మేనా నీది. నా మాట విను: ఆ వ్యాసాన్ని వుపసంహరించుకో. కోటీశ్వరయ్య నష్టానికి భయపడి మిల్లునుంచి కూలీలను తగ్గిస్తే తగ్గించవచ్చు - కాని ఆయన సహజంగా మంచిమనిషి.

ప్రకా: మనుషుల మంచితనం మన పొట్టల్ని నింపలేదు. నేను వ్రాసింది కేవలం వాళ్ళ యినప్పెట్టెల్లో ఎందుకూ పనికిరాకుండా పడున్న డబ్బుగురించి.

గోపా: అది ఆయన ఆస్తి.

ప్రకా: కావచ్చు. కాని దానివల్లే పదిమంది పరోక్షంగా పస్తుల్తో పడుకుంటె?

గోపా: ఇది నా విషయంలోగూడ వర్తిస్తుంది - ఎందుకంటె నాదగ్గర గూడ నిల్వ సొమ్ముంది.

ప్రకా: సొమ్ముని నిల్వ చేసుకొనే వాళ్లని నిందించరు ప్రజలు, కాని నిలవ చేసుకొనే ప్రతివాళ్ళ ప్రాణానికి పడి ఏడుస్తారు ప్రజలు, కృంగిపోతూ.

గోపా: ఇది నీ నా వాదాలవల్ల పరిష్కారమయ్యే సమస్యకాదురా.

ప్రకా: పరిష్కరించాలనేగా ఈ పాట్లు.

గోపా: వీగిపోతావ్!

ప్రకా: అవును, నీలాంటి నిరాశావాదులు నిరుత్సాహపరుస్తుంటే తప్పక వీగిపోతాను.

గోపా: ఐతే నాదగ్గరనించి నీకేం సహాయం కావాలి?

ప్రకా: రెండువేల రూపాయలు.

గోపా: రెండువేలే? ఎందుకు?

ప్రకా: నిజాన్ని ఋజూ చెయ్యడానికి.

[లోపలనించి సుమిత్ర: 'టీ రెడీ']

గోపా: తీసుకరా...ప్రకాశ్ మరోసారి చెబుతున్నాను, నా మాట విను: మన పోటివాళ్లకి ఈ లేనిపోని తగూలాట మంచిది కాదు. ఎటుపోయి ఎటొచ్చినా ఈనాడు మన్ని ప్రోత్సహించేవాళ్ళే రేపు నడి ఊబిలో విడిచిపోతారు.

ప్రకా: సరె, నీవాదన నీది, ఇంతకీ ఆ సహాయం చెయ్యగలవో లేదో చెప్పేసెయ్.

గోపా: దానికేం...

ప్రకా: ఐతే ఈ ధర్మబోధ నాకెందుకు?

గోపా: నన్ను పిసనారిగా జమకట్టావా?

ప్రకా: నా మాటల్లో ఆ అర్థముందా?

గోపా: ...నువ్వు తొందరపడుతున్నావురా, కాస్త నిదానించి ఆలోచించినట్టయితే...

ప్రకా: ఇక ఆలోచించవలసింది ఏం లేదు. ఇంతకీ ఈ సహాయం చేయగలవో లేదో చెప్పు.

గోపా: చెయ్యడానికేం లేదు, కాని.. నాదగ్గర ప్రస్తుతానికి డబ్బులేదు.

ప్రకా: పోనీ ఎవరిదగ్గరనైనా యిప్పించగలవా?

గోపా: ఎవరిదగ్గరైనా నే నెలా యిప్పించగలను?

ప్రకా: బ్యాంక్‌లో నీకు పదిహేను వేలవరకు వుందిగా పోనీ అందులోంచి...

గోపా: [తడబిడతో] బ్యాంక్ సొమ్మా! అదెలా తీయమంటావో చెప్పు?

ప్రకా: నీకు బంధువులకంటె బ్యాంక్ సొమ్ము ముఖ్యమన్నమాట!

గోపా: [కష్టపడి] కావచ్చు-

ప్రకా: ఐతే యివ్వలేనని సూటిగా చెప్పెయ్యగూడదు?

గోపా: నానోటితో ఆ మాట నెందుకనిపించడం? అలా నువ్వు భావిస్తే ఆ ముక్కగూడా నువ్వే అనేసెయ్.

ప్రకా: థేంక్స్ గోపాలం, ఇంతవరకు స్నేహితుడవి అనుకొన్నాను కాని..

గోపా: నీ మంచికోసమే చెప్తున్నాను.

ప్రకా: నీ సలహా అనవసరం...న్యాయవిచారణ దగ్గరకి వచ్చేసరికి నువ్వూ ఆ వర్గపు బంధువుడవే అనిపించుకొన్నావ్... థేంక్స్.

సుమి: [వస్తూ] అబ్బ! టీ అవసరం లేదా?

ప్రకా: [వినిపించుకోడు] ఆఁ, ఆవిడేది సుమిత్రా.

సుమి: లోప లుంది.

ప్రకా: పిలు వెళ్ళాలి.

సుమి: వెళ్ళొచ్చులే తొందరేముంది? ఈ టీ కాస్త తీసుకో.

ప్రకా. నో, థ్యాంక్స్ సిస్టర్ - మన బంధుత్వం ఈ మాత్రపు అభిమానానైనా ప్రసాదించింది.

[తలుపు బయటనించి ఎవరో కొడతారు]

సుమి: ఉండు, ఎవరో వచ్చినట్టున్నారు [తలుపు తీస్తుంది]

సత్యవాది: సంపాదకుడు: డాక్టరు లేరండి?

సుమి: లోపల వున్నారు వెళ్ళండి.

స. సం: (వస్తూ) గుడీవినింగ్ డాక్టర్,

హాల్లో! ప్రకాశరావుగారు కూడా యిక్కడే వున్నారే!

(ఎవరూ మాటాడరు) వాట్సిట్? నో రెస్పాన్స్!...అచ్ఛా! డాక్టర్ జీ, మా ఆవిడకు కొంచెం జలుబు చేసింది ఓసారి యింటికి వస్తారూ?

గోపా: (పరధ్యానంగా) ఊఁ? (అర్థమైనట్టు) ఊఁ వస్తా, యిక్కడే వుండండి యిప్పుడే వస్తా (లోపలికి వెడతాడు.)

స. సం: ప్రకాశరావుగారు, ఏం అలా మౌనంగా కూర్చున్నారు?

ప్రకా: ఏం లేదు లెండి, మన రచన గురించి ఆలోచిస్తున్నాను.

స. సం: భేష్! సరిగ్గా జ్ఞాపకం తెచ్చారు. దాని గురించే చెప్పడానికి వచ్చాను. ఆ రచనని మీరు ఉపసంహరించుకోండి.

ప్రకా: (ఆశ్చర్యంగా) ఏమిటి మీరనేది?

స. సం: నిజమే మిస్టర్ ప్రకాశ్, ఆ రచన ప్రచురించినందుకు నేను, వ్రాసినందుకు మీరు కోర్టుకి హాజరుకావాలి.

ప్రకా: తెలుసు.

స. సం: అందుకే చెబుతున్నాను. అన్నీ ఎరేంజ్ చేసేశాను. మీరు ఆ రచనని ఉపసంహరించుకొంటూ కోటేశ్వరయ్యకి ఎపాలజీ యిచ్చుకున్నట్టయితే ఈ లేనిపోని తగవులుండవు.

ప్రకా: మీ మాటలు అర్థం కావటం లేదు. లేనిపోని తగవులు తరతరాలుగా పుట్టినవి కాదు రామకృష్ణగారు. ఈ మధ్యే పుట్టాయి. వాటిని పరిష్కరించడానికి మనం యిప్పుడే పూను కోకపోతే అవి ప్రమాదకరంగవు.

స. సం: నిజమే కావచ్చును. కాని అందులో దిగేముందు మన శక్తిని కూడా పరీక్షించుకోవాలిగా?

ప్రకా: 'ఐక్యత' అనే మాటని మీరు మరచిపోయినట్టున్నారు.

స. సం: లేదు; ప్రజల్లో 'ఐక్యత' ఎప్పుడూ గడ్డితాడులాంటిదే. ఏమాత్రం అగ్గి తగిలినా సోదెలోకైనా రాకుండా నాశనమైపోతుంది.

ప్రకా: దీన్ని బట్టి మీలో మీకే నమ్మకం తగ్గిపోయినట్టనిపిస్తోంది...మీకు యిక్కడ చాలవరకు పలుకుబడి వుంది. మీ పత్రికకుకూడా స్థానికంగా ఎంతో గౌరవంవుంది. మీలాంటివాళ్ళే ఈ వ్యాసానికి యింతగా భయపడుతున్నారంటే...

స. సం: భయపడటం లేదు ప్రకాశరావుగారు. కాని మీరు వ్రాసినవ్యాసంలో నిజం కాని సంగతులున్నవని...

ప్రకా: నిజంకాని సంగతులా!?

స. సం: అవును.

ప్రకా: అయితే యిదుగో ఈ వారం అంకెలతో సహితం వ్రాసిన వ్యాసం యిస్తున్నాను. ప్రచురించండి, దీనికేలాంటి సమాధానం వస్తుందో?

స. సం: మై గాడ్! మరో వ్యాసమా? మొదటిదానికే యింత గడబిడ అయింది...

ప్రకా: ఏం గడబిడ?

స. సం: నిన్న కోటేశ్వరయ్య స్వయంగా నాదగ్గరికి వచ్చాడు. వ్యాసంలో ప్రతీ విషయం అబద్ధమే అని వాదిస్తూ కోర్టులో కేసు పెడతానన్నాడు. నేను మొదట చాల ధైర్యంగా ఎదిరించాను కాని, ఆయన చెబుతున్న విషయాలు వినేసరికి...

ప్రకా: మీరు చల్లబడి ఎపాలజీ అడిగారు......అధికారి యెవరైనా తన తప్పుందని చెప్పుకొంటారా రామకృష్ణారావుగారు?

స. సం: కాని ఆయనలో తప్పుందని నమ్మలేను.

ప్రకా: ఐతే నాలో వుందని నమ్ముతారా?

స. సం: అహాఁ! అలా ఎలా అనగలం చెప్పండి? పొరపాటున మీరు ఏదో వ్రాసి వున్నట్టయితే అది మీకు వచ్చిన ఫాక్ట్స్ ఇన్ఫర్మేషన్ వల్లే అయుండాలి.

ప్రకా: ఫాక్ట్స్ ఇన్ఫర్మేషన్ని ఆధారంగా తీసుకొని వ్రాసేంత అజ్ఞానిని కాదు రామకృష్ణగారు! నేను ఆ మిల్లులో ఆడిట్లో పనిచేస్తున్నట్టు మీకు జ్ఞాపకం తెస్తున్నాను.

స. సం: పని చేసినంతలో నిజమే వ్రాస్తారని ఎక్కడా లేదు.

ప్రకా: ఐతే యింతవరకూ మీరు ప్రచురించిన నా వ్యాసాలమీద మీ అభిప్రాయం?

స. సం: వాటికీ దీనికీ చాలా వ్యత్యాసముంది ప్రకాశరావుగారు. ముందు మీరు వ్రాసినవన్నీ సంఘానికంతకూ సంబంధించిన సమస్యలు. కాని యిది ఒకే ఒక వ్యక్తిని, సంస్థని వేలుపెట్టి చూపిస్తూ వ్రాసిన వ్యాసం. అందువల్ల పత్రికకు గూడా దెబ్బ తగుల్తుంది.

ప్రకా: మీరు పత్రిక్కి తగిలే దెబ్బ గురించే ఆలోచిస్తున్నారన్నమాట!

స. సం: కొన్ని సందర్భాల్లో *Absolute truths* కూడా *Reverse* అయిపోతుంటాయి ప్రకాశరావుగారు. నేను ఒకరికి జడిసే మనిషిని కాను. ఈ సంఘాన్ని ఉద్ధరించేందుకు యిలాంటి లక్షలు పత్రికలు సర్వనాశనమైపోయినా లెక్కచెయ్యను.

ప్రకా: మరీ సంకోచం దేనికండి?

స. సం: చెప్పానుగా రివర్స్ యేబ్సల్యూట్ ట్రూత్స్ గురించని.

ప్రకా: ఆ రివర్స్ యేది మన మనస్సులో వుండే భయంవల్ల కాని, నిజం వెల్లడిచేయడంవల్ల కాదండి...ఐతే సంఘమంటే మీ అభిప్రాయం ఏమిటండి?

స. సం: ఏమిటైనా కావచ్చు, కాని యిక్కడది అప్రస్తుతం.

ప్రకా: అప్రస్తుతం అంటే ఎలా కుదురుతుందండి? వ్యక్తుల కూడికే సంఘమనిన్నీ, ఆ వ్యక్తులే మనం అనిన్నీ అందులో అర్థం కాదా?

స. సం: ఆ అర్థాల నిర్వచనాన్ని ఎవరూ రియల్ వర్ల్‌లో రియలైజ్ చేయలేరు మిస్టర్ ప్రకాశ్.

ప్రకా: సంపాదకులు మీరే గుర్తించలేంది అజ్ఞానులేం గుర్తించగలరు లెండి.

స. సం: ప్రకాశరావుగారు! మీ రిప్ల

ఏదో ఉద్వేగంలో వుండి యుక్తాయుక్తాలని గుర్తించలేకపోతున్నారు. రేపటివరకు ఆగండి సావకాశంగా ఆలోచిద్దాం.

ప్రకా: రేపటి వరకు యెందుకండి? మీ రెలాగూ ఆ వ్యాసాన్ని ప్రచురించినందుకు ఎపాలజీ కోరుకొన్నారు. ఇక నన్ను గూడ అలా కోరుకోమంటారా?

స. సం: నేను చెప్పిన విషయాలు సరిగా ఆలోచించుకోండి ప్రకాశరావుగారు. విదురుడన్నట్టు: బలప్రదర్శనం గూడ తమంతటి వారితోటే గాని...

ప్రకా: విదురనీతి నాకు తెలుసులెండి. ఐతే యింతకీ మీరీ నాకీ కేసులో సహాయం చేయలేనంటారు!

స. సం: ఆహాఁ, అది కాదండి.

ప్రకా: కర్ర విరక్కుండా, పాము చావకండా అన్నట్టు మాటాడకండి, మీ అసలు అభిప్రాయం చెప్పేస్తే మంచిది. ఎందుకంటే, రేపా కేసులో...

స. సం: ఐతే నా అభిప్రాయమేమీకు కావాలంటె... నే నెలాగూ ఎపాలజీ కోరుకొన్నాను. కాబట్టి...మీకు నేను...స...హా...యం...చేయ...లేను...

ప్రకా: థేంక్యూ, మిస్టర్ రామకృష్ణ, థ్యాంక్యూ, క్లైమాక్సులో గాని ఈ నగ్న సత్యం బయటపడదు. మన మనస్సుల్లో ఈ మసికే యిన్ని రంగులూ రాసుకొని సంఘంలో ఘరానాగా చెలామణీ అయిపోతున్నాం...

స. సం: మీరు మరోలా అనుకోకండి ప్రకాశరావు గారు.

ప్రకాశరావు: నోనో, మిస్టర్ రామకృష్ణ, ఎబ్సల్యూట్ ట్రూత్ ని నే నెప్పుడూ రివర్సుగా తీసుకోను.

గోపా: (వస్తూ) రాండి, రామకృష్ణ గారు.

స. సం: వస్తున్నా...వస్తా ప్రకాశరావు గారు (వెళ్తూ) నడవండి...

గోపా: (దూరంగా) వస్తా, యిక్కడే వుండరా ప్రకాశ్, ఈ కేసేదో చూసుకొని (నిష్క్రమణ)

ప్రకా: (నిట్టూర్పుతో నవ్వు) వండర్! మానవులంతా యింతేనా? (కుర్చీలోంచి లేచి) వీళ్ళ మనస్తత్వాలు యిహ మారవనుకొంటూ...

సుమి: (వస్తూ) అరె! టీ తీసుకోలేదేం?

ప్రకా: (వినిపించుకోకుండా నవ్వుతాడు.)

సుమిత్ర: ఏమిటా పిచ్చినవ్వు?

ప్రకా: కాదు సుమిత్రా. ఈవాళ ఓ ఎబ్సల్యూట్ ట్రూత్ ని కనిపెట్టాను. మీ వదినేది?

సుమిత్ర: లోపలుంది.

ప్రకా: రమ్మను...లీలే నాకు నిజమైన ధర్మబోధని చేసేది. అబ్బే, అప్పుడు అర్థమయ్యేది కాదు. ఎలా అర్థమవుతుంది? (నవ్వుతాడు) అర్థం కాదు.

లీల: (ప్రవేశిస్తూ) ఏమిటా పకిలినవ్వు?

ప్రకా: ఆఁ అయింది. నడు లీలా వెళ్లిపోదాం. నాకు నిజమైనదారిని చూపగలిగే సహచరివి నువ్వే (నిష్క్రమణ).

సుమిత్ర: అన్నాయ్...!

[తెర] 



చైనీస్ జంత్రవాద్యగాడు

మిస్ అగస్టా మిలికిన్ బొగ్గుతో వేసిన ఒక చిత్రం.

# తొమ్మిదో ఘట్టం

[గడిచిన ఘట్టానికీ ఈ ఘట్టానికీ మధ్య వ్యవధి లేదు. ఒక చిన్న చర్చిలో ముందు గది. గదికి రెండు వైపుల ద్వారాలు. అప్పుడే ఒక ఫాదరీ గది ప్రవేశిస్తాడు, కుడివైపు గుమ్మంలోనించి. సన్నగా పొడుగ్గా వుంటాడు. ఎప్పుడూ నుదురు ముడతలుపడి వుంటుంది. మేజా మీద పువ్వులుంచి వెనక్కి తిరిగి వెళ్లి పోతాడు. ఎడమవైపు గుమ్మంలోనించి డెనాంట్ చల్లగా ప్రవేశించి తలుపు మూస్తాడు. ఒక్కసారి గది అంతా కలయ చూసి కుడివైపు గుమ్మం సమీపిస్తాడు. ఫాదరీని గమనించి వెనక్కి తగ్గుతాడు. ఫాదరీ సన్నగా ఒకగీతం పాడుకుంటూ తిరిగి ప్రవేశిస్తాడు. డెనాంట్‌ని చూసి నిలబడి పోతాడు.

ఫాదరీ : ఓ! ఎవరు?

డెనాంట్ : శరణార్థిని.

ఫా : అంటే? అసలు మీరెవరు?

[డెనాంట్ కోటు విప్పి చూపుతాడు. ఖైదీలకిచ్చే గళ్ళచొక్కా కనపడుతుంది]

ఫా : ఒహో! పరారైన ఖైదీయా. ఇలా రావడానికిది సరైన చోటు కాదే!

డె : మరేది సరైన చోటు? పూర్వ కాలంలో చర్చిలలో......

ఫా : పూర్వకాలంలో చర్చి వేరు. ఈ కాలం చర్చిమీద ప్రభుత్వాధికారం చెలామణి అవుతోంది.

(డెనాంట్ గుమ్మంవైపుకి నడుస్తాడు.)

ఫా : ఒక్కక్షణం ఆగు. (నల్లని నిలువు గౌను తొడుక్కుంటాడు. ఫాదరీ నిశ్చల భావానికి డెనాంట్ ఆశ్చర్యపడతాడు)

ఫా : కెప్టెన్ డెనాంట్ అంటే నువ్వే అనుకుంటా.

డె : అవునండి.

ఫా : (తనలో గొణుక్కున్నట్లు) పాపం! (డెనాంట్ తెల్లబోయిచూస్తాడు)

డె : చావంటే ఎలాటిదో యుద్ధంలో చూసిన మావంటివాళ్ళకి తెలుస్తుంది కాని...

ఫా : అవునవును. నేను చూశాను.

డె : నిజం?

ఫా : అదేం ప్రశ్న! ఇక్కడికెల్లా వచ్చావ్?

డె : ఆ కనపడే యింట్లోనించి వచ్చానండి, పాపం నన్ను కాపాడేవిషయంలో ఇద్దరూ తగువులాడుతోంటే వచ్చేశాను. నావల్ల వాళ్ళకి తగువెందుకు? అనవసర మనుకున్నాను.

ఫా : (చిరునవ్వుతో) అవును. డోరా నిన్ను కాపాడాలనుంటుంది. గ్రేస్ ఒప్పుకోలేదనుకుంటాను. అంతేనా? కాని డోరా చర్చికెప్పుడూ రాదు. గ్రేస్ ప్రతిరోజూవస్తుంది. భక్తి ఎక్కువ. అయినా దీనికి తగువెందుకొచ్చింది. (తటుక్కున ఊహతట్టి, తెల్లబోతాడు). ఏమిటి నిన్ను వెంటాడుతున్నారా?

డె : వేటాడుతున్నారు.

ఫా : శరణా? హుం. నాకెప్పుడూ ఇలాటి చిక్కురాలేదు. పూర్వపు రోజులైతే...

డె : సరే! ఇంకెందుకులెండి. నాపని అయిపోయింది. ఎల్లాగూ వాళ్ళకి చిక్కిపోడం తప్పదు. పోనీ కొద్దిసేపు విశ్రాంతి అయినా తీసుకుంటాను. అది చాలు, మీరు ఒప్పుకుంటే.

ఫా : కూచో, కూచో, (కుర్చీ చూపిస్తాడు. చూపించి వెళ్లి రెండు ద్వారాలూ బంధిస్తాడు. తనో కుర్చీలో కూర్చుని) ఆకలి వేస్తోందా?

డె : (కుర్చీలో కూలబడి) ఆకలా! ఇంకా ఎక్కడ ఆకలి? అదెప్పుడో చచ్చిపోయింది. ఆకలి చచ్చిపోడమంటే మీకూ అర్థమౌతుందనుకుంటాను.

ఫా : (బుర్ర అడ్డంగా తిప్పుతాడు) చర్చిలో ఉండేవాళ్లం అన్నీ వేళప్రకారం అనుసరిస్తాం.

డె : యుద్ధంలో కూడాను?

ఫా : యుద్ధంలో కూడా? నిజమే. (ఫాదరీ తీవ్రమైన ఆలోచనలో పడుతాడు. మనస్సులోని కలవరం ముఖంలో స్పష్టంగా ప్రతిఫలిస్తూంది)

డె : ఫాదర్! నిజం చెప్పండి. మీరేం చెయ్యదల్చుకున్నారు? నన్నప్పగించేస్తారా?

ఫా : (అవహేళనగా) ఫాదర్! ఫాదర్ని సరే. (కొంత ఆలోచించి చటుక్కుని లేచి వెళ్లి డెనాంట్‌వద్ద నిలబడతాడు) నేను ఫాదరీ నన్నమాట కాస్సేపు మరిచిపో. మనిద్దరం మామూలు మనుషులమే ననుకో. ఇప్పుడు చెప్పు. నిన్ను పోలీసులకి అప్పగించడానికి నే నెవర్నంటావ్? నువ్వు ఆపదలో వున్నావు. నేను నిస్సహాయస్థితిలో ఉన్నాను. (తల అడ్డంగా తిప్పుతూ) లాభంలేదు. నువ్వు పారిపోడానికి కూడా నేను సాయపడలేను. పోనీ విశ్రాంతి తీసుకో. అంతే.

డె : హుం. ఇటువంటి పరిస్థితిలో క్రీస్తుదేవుడేం చేసేవాడో!

ఫా : (గంభీరంగా) అదే గట్టి ప్రశ్నోయ్! ఇప్పుడు ప్రపంచానికే పట్టుకుంది సమస్య. ఏ పరిస్థితిలో క్రీస్తుదేవుడేం చేసివుండేవాడో ఎవ్వడికీ తెలియదు. ఏదో ఎవరికితోచిన సమాధానం వాళ్లు చెప్పెయ్యొచ్చు. కాని అసలు సమస్య తీరదు. ఆ పుస్తకాలు చదివిన కొద్దీ ఆమహానుభావుడి లీలలు మరీ అగమ్యగోచరంగా వుంటాయి. క్రీస్తుదేవుణ్ని నమ్ముకుని బతికే మావంటివాళ్ళకి దారి తెన్నూ కనపడ్డంలేదు. (డెనాంట్ నీరసంగా కుర్చీలో సోలిపోతుంటాడు) బాగా నీరసంగా ఉందా?

డె : అబ్బ! ఇంత నీరసం, ప్రయాస ఎన్నడూ ఎరగను. కీళ్లు కదలనంటున్నాయి. మళ్లా నేను పరుగుల పందేల్లో మొనగాణ్ణే ఇదివరలో. నీకు పారిపోవాలనెందుకు బుద్ధిపుట్టింది?

డె : ఏముంది. పిల్లిని బోనులో ఉంచి కొన్నాళ్ళ తరవాత పొరపాటువల్ల తలుపు

(52-వ పేజీ చూడండి)

# పిల్లల పెంపకం

కామేశ్వరరావు ప్రొద్దున్నే కాఫీ త్రాగి ఆఫీసు ఫైల్సు తన ముందు వేసుకొని—సిగరేటు ముట్టించడానికి అగ్గిపుల్ల గీయగా వున్న ఒక్క అగ్గిపుల్లా తుస్‌మని ఆరిపోయింది. అగ్గిపెట్టెను పూపి పెదవి విరిచి కిటికీగుండా విసిరిపారేశాడు. వంటింట్లో వున్న అగ్గిపెట్టె తెచ్చేందుకు లేవబోయి—గడియారంవంక చూశాడు.

"అరె అప్పుడే ఎనిమిది దాటిందే—" లేచే వుద్దేశ్యాన్ని విరమించుకొని ఫైల్సుకు కట్టియుండే ఎఱ్ఱ టేపును విప్పుతూ—వరండాలో కూర్చొని ఆడుకుంటున్న కూతురును కేకేశాడు.

"అమ్మాయ్ లీలా-కొంచెం యిటురా-"

లీల తన చెల్లెలు పాపతో ఆడుకుంటూ వుంది. తండ్రి పిలుపు బొమ్మలకు గుడ్డలు కడుతున్న లీలకు వినబడలేదు.

"లీలా—మళ్లీ పోదువుగాని కొంచెం యిటు రా—"

"ఎందుకు నాన్నా!"

"కొంచెం అగ్గిపెట్టె తెచ్చిపెట్టు-"

"ఎక్కడుంది—"

"వంటింట్లో - అమ్మ నడుగు యిస్తుంది" కామేశ్వరరావు అవసరమైన ఫైలును బయటికి తీశాడు.

"నీవే అడుగు. యిస్తుంది - "

"నేను పని చేసుకుంటున్నా - మీ అమ్మకూడా దొడ్లో ఏదో పనిచేసుకుంటూ వుంది. కొంచెం పట్టుకరా - నీ ఆట ఎక్కడికి పోదులే—"

"అబ్బా! ఏంది నాన్నా నీది మరీనూ - పాప తెస్తుందిలే."

"పాప తేలేదు. ఇంతకూ నీవు తెస్తావా లేదా?"

"ఏం పోడు నాన్న నీది. పాప పీటి నంతా పాడుచేస్తుంది."

"చెయ్యదులే - పో—" కామేశ్వరరావు ఫైల్‌పై నోటు వ్రాయడం ఆరంభించాడు. లీల అగ్గిపెట్టెకోసం వంటింట్లోకి పరుగెత్తింది. ఆ విసురులో గాజులోటా ఆమె కాలికి తగిలి పగిలిపోయింది.

"ఏమిటే పగులగొట్టావ్—" బొగ్గుల కుంపటినుంచి కూర దింపుతూ లీలవైపు చూసింది కమలమ్మ.

"నాన్న అగ్గిపెట్టి తెమ్మన్నాడే—"

"అయ్యయ్యో! మాణిక్యమంటి లోటా ముంటపాగలు జేశావుగదే. నీ మిడిమేలం మండిపోను." పగిలిన లోటావైపు చూస్తూ అన్నది. కామేశ్వరరావు వ్రాయటం ఆపి వంటింటివైపు దృష్టి మరలించాడు.

"నాకు కనబడలేదే అమ్మా!"

"ఎట్లా కనబడుతుంది. కళ్లు నెత్తిమీద వుంటే."

"కానిచ్చి అగ్గిపెట్టీవె - పోవాల"

"ఎక్కడికి పోవాల్నె - నీ ఆట అధ్వాన్నంగాను. మాణిక్యమంటి లోటా నీ మొహాన పెడితినే."

"ఏమిటే - మళ్ళీ రాగాలు ప్రారంభించావు." కామేశ్వరరావు యిక భరించలేక వంటగది వాకిట్లోకి వచ్చాడు.

"ఏమిటో కనబడటంలేదూ - మాణిక్యమంటి లోటా."

"యిక చాలించు చూడక తగిలింది కామాల్నె - అదుగో - అగ్గిపెట్టె - తీసుకో - నిన్నే లీలా."

"అట్లా పిల్లల్ని నెత్తినేసుకోబట్టే మరీ మీరిపోయారు."

లీల తెచ్చిన అగ్గిపెట్టెను అందుకొని -




"మీరిపోతారులే - వకటే నస - అసలా లోటా వాకిట్లో ఎందుకుబెట్టావ్. కామేశ్వరరావు సిగరెటు వెలిగిస్తూ అని కుర్చీవైపు నడిచాడు. లీల వరండాలోకి పరుగెత్తింది.

"ఇంత అన్యాయపు బిడ్డలని నాకేం తెలుసు - వీళ్ళతోందర పాడుగాను."

"ఆ కూతలే వద్దనేది - "కుర్చీలో కూలబడి ఫైల్ అందుకొన్నాడు.

"ఏం కూతలు -"

"అవే - పాడుగాను - అన్యాయంగానూ - "

"పిల్లల్ని ఏమీ అనకుండా చేయకుండా-మీది మరీ ఆగడం అయిపోయిందే -"

కామేశ్వరరావు విసుగుతో ఫైల్‌ను స్టూల్‌పై వేసి.

"ఏదో అనకుండా వుండలేవన్నమాట. అనకుండావుంటె వచ్చే చిక్కేమిటో కాస్త చెప్పు. ఎన్నిసార్లు చెప్పినా - పిల్లల్ని ఏవిధంగా పెంచాలనో నీకు అర్థం కావటంలేదు. నీ వనేమాటలు వాళ్ళకి పట్టుబడతవని తెలియదూ - లీల యిప్పుడేమందో తెలుసా...ఏంది నాన్నా నీది వుత్తపోడు అంది. "పిల్లల్ని తిట్టడం అంటె నీకు మహా సరదా! అదే అలవాటై - ఆ మాటలు పిల్లలు నేర్చుకోడం - అంతటితో ఆగుతుందా? పిల్లలు - నీవూ మీలో మీరే తిట్టుకోడం ప్రారంభిస్తారిక. నీ చేష్టలు చూస్తుంటే నాపరువు తిసేట్టున్నావు. ఏదన్నా తప్పు చేస్తే చురుకుముట్టా ఒక్క దెబ్బ వెయ్యి. అంతేగాని వూరికే నస గొడుతూ, వాగినదానివల్ల ప్రయోజనం. వాళ్ళకా తిట్టులంటె యిక ఒక లెఖ్ఖ కూడా వుండదు. అంతకంటె భయంకూడా పోతుంది. ఆఖరికి పిల్లల్ని రోషంలేని మొద్దులుగా తయారుచేసేట్టు వున్నావు."

"అదేమిటంటె నా యెదాన పడండి. యీ పాడుకొంపలో అటాన్న చాకిరిచేసి నాగుట్ట గూలుతుంటె - ఈ దిక్కుమాలిన పిల్లల పోరొకటి. ఆ సుబ్బమ్మ పిల్లలు చూడ ముచ్చటేస్తూ వుంటారు. యీ పాడు రాత నా వక్క మొహాన్నే రాశాడేమొ - ఏమైనా పుణ్యంకొద్ది బిడ్డలన్నారు."

"ఆ వాగుడే మానమనేది. సామెత లేకుండా - వూతపదం లేకుండా నీకు మాట్లాడటం చేతకాదు. అవంటేనే నాకు వళ్లు మండిపోతుంది."

"మండ కేం జేస్తుంది. అన్ని అమర్చి పెట్టేవాళ్లుంటె—"

"అమర్చిపెడుతుంటె యీ మాటలన్ని అనాలన్నమాట. సరె యిక చాలించు. నాకు బోలెడు పనుంది. వృధాగా నా టైమంతా పాడుజేశావు."

"యీ పొయ్యి మండక యిట్లా బొగ్గలవుతుంటె—ఏందమ్మా నాకీ పోడు."

"ఛా! ఛా! నీ జన్మ యింత. యీ కొంపలో వుండేదానికంటె ఎటన్నా దేశాంతరం పోవడం మేలు—"

"మీ బదులు నేనే పోతానులెండి. అప్పుడు తెలుస్తుంది"

"ఏం మహా బెదిరిస్తున్నావే—"

"బెదిరించే పనైతే మీ రెండు కిట్టా చిందులు తొక్కుతారు. పిల్లల నేమన కుండా - కసరకుండా - తిట్టకుండా ఏ ఆడ కూతురు చేస్తుందో—దినమూ యిదే పోడా - ఎంత నా రాత రాళ్ళపాలైతే మాత్రం."

"ఎక్కడ నేర్చావే యివన్నీ. ప్రాస లేని మాట వక్కటి రాదే నీనోటిగుండా - ఎవరు పెంచారో గాని వాళ్ళకు దండం పెట్టుకోవచ్చు."

"పెంచి నోళ్ళేమి బాగానే పెంచారు... పెంచి..."

"నా నెత్తిన దోచారు - అనుభవించరా అని."

"వాళ్ళే గనుక ఆదుకోకుండా వుంటె అనుభవించేవారే"

"ఏంది వాళ్ళు ఆదుకొన్నది. నీవల్ల నా జీవితమంతా ధ్వంసమైపోయింది. బండెడు చాకిరి చేస్తున్నా సుఖం లేదు—"

"నేనేగా అష్టైశ్వర్యాలు అనుభవించేది. యీ పాడుకొంపలో వక్క క్షణం తీరక లేకుండా చేసినా చీవాట్లు తప్పటం లేదు."

"అంత కష్టంగా వుంటే పోరాదూ—"

"ఎక్కడికి పొయ్యేది. ఆలా పొయ్యే దాన్నయితే మీ చేత యిన్ని మాటలు ఎందుకు తింటాను."

"పోకపోతే చచ్చినట్టు పడుండు. నీ యిష్టం వచ్చినట్టు వాగుతూ యీ యింట్లో వుండటానికి వీల్లేదు. యీ రోజు నా పనంతా పాడుచేశావ్. ఆఫీసరు ఎన్ని ీవాట్లేస్తాడో నీకేం తెలుస్తుంది. వెధవ ోటాకోసం నానా హంగామా చేసి - ువ్వు ఏడ్చి, యితరులను ఏడ్పించి - ఎందు ొచ్చిన రద్ది యిదంతా — చుట్టుపక్క ోళ్లు నవ్వటానికి తప్ప."

"నవ్వనీ — వాళ్ళ పళ్ళే బయట పడ యే. అయినా ఎంచుకుంటె మంచాని ంతా కంత లేలే."

"ఇక చాలించు కమలా! నాకు బోలెడు పని వుంది. పోనీ నామీద దయుంచి మైనా—"

"ఏందబ్బా యిది. బుద్ధి గడ్డి తిని లోటా గులగొట్టావుగదే అన్నాను. దానికింత ాద్ధాంతమా - ఎంత నా రాత అన్యాయపు రాతైతే మాత్రం."

"నీ రాత గాదు. నా రాత. నిన్ను అనడ మంతా నా తప్పే. వక్కసారి పక్కలిరుగ నంతే—"

"ఎందుకు తన్నుతావ్. తన్నడానికి నాకు నీవేమీ పెట్టడం లేదు. యింకా



"పిల్లల్ని ఏమీ అనకుండా చేయకుండా మీద మీరి ఆగడం అయిపోయిందే"

"ఏదో అనకుండా ఉండలేవన్న మాట."

నేనే యీ గతిమాలిన కొంపకు కోడుతున్నాను. ఆ యింటి బాడుగే కూడేసుకుంటే ఏడాది కొక దండ చేయించుకో నేదాన్ని"

హఠాత్తుగా కప్పు నెత్తిపై కూలినట్టయింది కామేశ్వరరావుకు. కొంత తమాయించుకొని—

"అవును కమలా! నిజమే. ఆ యింటి బాడుగ నీది. నాది కాదు" అంటూ రెండు

# కోరి భజింతున ఇంగ్లీష్ చదువును!

బ్రిటిష్ వారి ప్రభుత్వాధికారం యీ భారతదేశంలో విస్తరిస్తున్న కాలంలో బెంగాలు రాష్ట్రంలోని కలకత్తా నగరమే భారత దేశానికి ప్రధాన ప్రభుత్వ కేంద్ర స్థానంగా ఉండేది - 1835 సం॥లో ఇండియాకు గవర్నరు జనరలుగా విలియం బెంటిక్కు ప్రభువు ఉండేవాడు. భారత దేశంలోని ప్రజలకు ఎటువంటి విద్యాపద్ధతి ఉండవలెను ? అనే విషయమై పరిశీలించి సలహా యివ్వడానికి, "పబ్లికు-ఇన్‌స్ట్రక్షను-కమిటీ" (ప్రజా విద్యాబోధన విచారణ సంఘం) ఒకటి అప్పుడు నియమింపబడింది. ఈ కమిటీకి మెకాలే ప్రభువు అధ్యక్షుడు - "ఈ దేశంలో ప్రజలకు యింగ్లీషుభాషను బాగా బోధించవలెను-యూరోపియనులు కనిపెట్టిన శాస్త్ర విషయాలనే భారతీయులకు బోధించాలి- ఈ పాశ్చాత్య శాస్త్రాలను ఇంగ్లీషుభాషలోనే బోధించాలి" అని మెకాలే ప్రభువు ఆ నివేదికలో వ్రాశాడు-

మన దేశ భాషలలోనే మన శాస్త్రాలను మన ప్రాచ్య సాహిత్యాన్ని స్కూళ్లలో బోధించాలని కొందరు భారతీయులు ఆనాడు వాదించారు. వీరు "ప్రాచ్య విద్యా వాదులు." కాని, మనలోనే కొందరు పెద్దలు ఆంగ్లేయుల పాండిత్యమే మన స్కూళ్లల్లో బోధించవలెనన్నారు. వీరు "ఆంగ్ల విద్యావాదులు".

1835 సం॥ లో మెకాలే ప్రభువు తన నివేదికయందు ఆంగ్ల విద్యాశిక్షణం అవసరమని సిఫార్సు చేయకపూర్వమే, రాజా రామమోహన రాయలవారు 1-23 సం॥లో అప్పుడు గవర్నరు జనరలుగా ఉన్న అమ్‌హారెస్టు ప్రభువుకు ఒక పెద్ద ఉత్తరం చాలా ఘాటుగా వ్రాశారు - కలకత్తాలో సంస్కృత కళాశాల ఒకటి ఏర్పాటు చేయడానికి అమ్‌హారెస్టు ప్రభువు అప్పుడు సంకల్పించాడు. ఈ సంస్కృత కళాశాలను స్థాపించకూడదనియు దానికి బదులుగా ఇంగ్లీషు చదువు నేర్పేటుటవంటి కాలేజీని ఏర్పాటు చేయవలెననియు గట్టిగా వాదిస్తూ రాజా రామ మోహనరాయిగారు ఆ ఉత్తరంలో వ్రాశారు - ఇంగ్లీషు చదువునే స్కూళ్లలో నేర్పవలెననీన్నీ, ఇంగ్లీషువారి శాస్త్రములనే మనకు బోధించవలెననీన్నీ మెకాలే ప్రభువుకంటె చాలా తీవ్రంగా రామ మోహనరాయి గారు వాదించారు-

ఈ ఇంగ్లీషు చదువు మూలంగా మనవాళ్ల మూఢనమ్మకాలు, మూఢ ఆచారాలు పోయి ఎక్కువ జ్ఞానం కలిగి భారతజాతి బాగుపడుతుందని రామ మోహన రాయిగారు ఆశపడ్డారు. ఈ ఇంగ్లీషు చదువుమూలంగా భారతీయులస్వజాతీయ వాసనలన్నీ తప్పకుండా నశిస్తాయనిన్నీ, వారికిఉన్న సంప్రదాయాలన్నీ పోయి వారుపూర్తిగా ఇంగ్లీషు పద్ధతులలోకి యీ చదువువల్ల త్వరలోనే మారిపోగలరనిన్నీ మెకాలే ప్రభువు అన్నాడు- ఏమైతే నేం? రాజా రామ మోహన రాయలవారు "కోరి భజింతును ఇంగ్లీష్ చదువును" అని 130 ఏండ్ల క్రింద దానిని హర్షించారు- ఆ యింగ్లీషు చదువు చదివిన తర్వాత "మా కొద్దు యీ తెల్లదొరతనము" అనే పాట ప్రారంభించాము.



# పిల్లల పెంపకం



చేతులతోను తల పట్టుక కూర్చొన్నాడు. వంటింట్లో కమలమ్మ గొణిగే మాటలు అతనికి శూలాల్లాగ గుచ్చుకుంటున్నయ్. పట్టరాని కోపం వస్తుంది. పోయి తన్ని వస్తామా అనుకుంటాడు. "తన్ని మాత్రం ప్రయోజనం. మరింత రెచ్చుతుంది. పిల్లలు ఏడుస్తారు. చుట్టుపక్కలుండే జనం మూగుతారు. ఎంత అసహ్యం......గతిమాలిన కొంప. ఎంత అహంభావం. తానేదో యిస్తుండబట్టేగా ఆ మాటన్నది. రేపు మనిఆర్డరు రాగానే విసిరిపుచ్చి మొహాన పారేస్తాను. జీతం చాలదు. పోనీ ఏలాగో సరిపెట్టుకుంటాను. పేలికలు వేసుకొని తిరుగుతాను. వుత్త కాఫీ తాగుతాను. సినిమాలకు పోను. సిగరెట్లు ముగించి బీడీలు కాలుస్తాను. ఎన్ని అవస్థలుపడ్డా దాని డబ్బు వక్క దమ్మిడి తాకను...పిల్లలపై ఎప్పటి మాదిరిగా అరుస్తుంటుంది. అప్పుడేం చేయాలి. ఏమన్నా అంటె రెచ్చుతుంది. రెచ్చి అట్టనే మాట్లాడుతుంది. పిల్లల్ని దగ్గరకు తీస్తాను. అంతే—ఆ మనిషితో యికేమీ మాట్లాడను. అప్పుడే కాదు - ఎప్పుడూ పలకను. పలకరించినా వూ అనటమే గాని పలక్కూడదు. ఇదివరకెప్పుడన్నా వక్కపూట పలక్కుండావుంటె - రెండోపూట అతి వినయం చూపించేది. పలికేప్పుడుకంటె పలకనప్పుడే ప్రాణానికి హాయిగా వుండేట్టుంది. ఇప్పుడీ సాకుతో పలకటం ముగించి, రేపు పదో తారీఖు యింటిబాడుగ పైకంరాగానే దాని మొహాన పారేస్తే - తర్వాతచూస్తాం—"

ఇంతలో గడియారం టంగుమని గంట కొట్టడం ప్రారంభించింది. కామేశ్వరరావు అదిరిపడి గడియారంవైపు చూశాడు. చిన్నముల్లు పదిపై వుంది. లేచి చొక్కా తీసి - తుండుగుడ్డ భుజాన వేసుకొని స్నానం చేయడానికి దొడ్లోకి వెళ్ళాడు. పొయ్యిమీద నీళ్లు పెట్టి వున్నా - భావిలోంచి నాలుగు చేదలు తోడుకొని - స్నానం చేస్తూవుండగా "వృధాగా నీళ్లు మరగ కాశానే" అని కమలమ్మ అనటం వినబడింది. దానికేమీ సమాధానం చెప్పకుండా - స్నానంచేసి-వళ్లు తుడుచుకొని, పంచకట్టుకుంటూ వుండగా - కమలమ్మ పీటవేయడం - మంచినీళ్లు పెట్టడం- ఆర్భాటంతో చేయసాగింది. "అమ్మాయ్-లీలా-పాపేది. అన్నం తిందాంరా - కామేశ్వరరావు పీటమీద కూర్చుంటూ పిల్లల్ని పిలిచాడు.

"వాళ్ళు తర్వాత తింటారులెండి. మీకు టైమయినట్టుంది."

"పాప రాలేదు నాన్నా - మేము కొంచెం తాలి తింటాంలే-" "ఆటల్లో మునిగిపోయింది లీల. కామేశ్వరరావు భోంచేసి ఫైల్సు తీసుకొని ఆఫీసు కెళ్ళాడు.

మరునాడు యింటిబాడుగ తాలూకు పైకం ముప్పైరూపాయలు మనిఆర్డరు వచ్చింది.

"అమ్మాయ్ లీలా - యీ డబ్బు మీ అమ్మ చేతి కియ్యి - యింటిబాడుగదని చెప్పు." కామేశ్వరరావు లీలచేతికి డబ్బు యిచ్చాడు.

"నాచేతి కెందుకే - గుడ్డలకొట్లో బాకీకి చెల్లేయమని చెప్పు."

"ఇంటిబాడుగ పైకమంటె-గుడ్డలకొట్లో చెల్లేయమంటుందేం - రేపొద్దున మళ్ళీ యీ గతిలేని కొంపకు పెట్టానని అంటానికా - ఆ డబ్బు వక్క దమ్మిడి నాకు వద్దు—"

"సరే. నేనే పంపిస్తాలే—"

"పంపించుకో, పంపించుకోకపో. యిక మీదట నా డబ్బు పెట్టానని వాగితేమాత్రం వొప్పుకొనేది లేదు—"

"వొప్పుకోకాకండి. అంత నిష్కర్షగా వుంటె - అది నా గుడ్డలతాలూకు బాకీయే గదూ. నా డబ్బుల్లోనే యిచ్చేస్తాను."

"సరే నీ యిష్టం." అంటూ వీధి కెళ్లాడు కామేశ్వరరావు.

ఆ రాత్రి కామేశ్వరరావుకు అన్నం పెడుతూ "ఏమండి, నేనేం చేశానని - అలా పిలిచినా పలక్కుండా - కాస్త చెప్పండి." అంది కమలమ్మ.

"ఏమీ లేదు—"

"ఏమీ లేకపోతే - అలా యెందుకయిపోతారు. ఏదో వుంది. చెప్పండి—"

"ఏమీ లేదంటె - ఏమీ లేదు." కోపంతో అన్నాడు.

"ఎప్పుడూ లేంది - ఆ కోపం. ఎక్కడ కూర్చున్నా - మాట పలుకు లేకుండా - ఎప్పుడన్నా వుందా - ఎందుకో చెప్పండి. మధ్యాహ్నం ఎంతసేపు ఏడిశానో మీకేం తెలుసు - అంతా నా కర్మ—"

"మళ్ళీ బూరగ ఎత్తుకున్నావా, ఏం లేదంటూవుంటె. యిక వాగితే లేచిపోతాను."

"మీకంత కష్టంగా వుంటె ఎందుకు మాటాడుతాను—" కమలమ్మ కళ్ళల్లో

# ★ పిల్లల పెంపకం ★

నీళ్లు తిరిగినయి. కామేశ్వరరావు గబగబా రెండు ముద్దలు మింగి మంచంపై వాలాడు.

నాలుగు రోజులు గడిచిపోయినా - కామేశ్వరరావు తన పట్టు వదల్లేదు. కమలమ్మతో పలక్కుండా ముభావంగా వున్నాడు. ఆమె అప్పుడప్పుడూ పిల్లల్ని వసిగినా - భర్తమాట వినడంతోటే మానేసేది. కామేశ్వరరావు తనతో పలక్కుండా యిన్నిరోజులుండటం యింతకు ముందెప్పుడూ జరగలేదు. ఇక పలకడేమోననే దిగులుతో - ఆమె వక పూట తిండి గూడా మానేసింది. దానికి కూడా కామేశ్వరరావు లొంగలేదు. తన జీవితంలో ఎప్పుడూ లేంది - కమలమ్మ యిప్పుడు నిజంగా భయపడసాగింది.

పక్కింటి సుబ్బమ్మ వంగోలుకు పోతుంటే - తన తల్లిని త్వరగా రమ్మనమని చెప్పిపంపింది. ఆమెకోసం ఎదురు చూస్తూ దిగులుగా వుండసాగింది. సుబ్బమ్మ ఏం చెప్పిందో ఏమో - యెకాయెకీన కమలమ్మ తల్లైన లక్ష్మమ్మ బయలుదేరివచ్చింది. విషయమంతా అడిగి తెలుసుకొని - ఆమె తన కూతురునే నాలుగు చీవాట్లేసింది.

ఆరోజు సాయంత్రం కామేశ్వరరావు వరండాలో పడక కుర్చీలో పండుకొని పత్రిక చదువుకుంటూ వున్నాడు. లక్ష్మమ్మ తలుపువద్ద చాపపై కూర్చొని "ఏం! నాయనా! అమ్మాయి చెప్పిపంపితే వచ్చాను. అదే చెప్పింది విషయమంతాను. దాని ధోరణే అంతి - తలతిరిగేటట్లు నేను కూడా చీవాట్లేశాను. నాదగ్గిర పెరిగితే అది అలా వుండేదికాదు. వాళ్ళ నాయనమ్మ మాటలే దానికి పట్టుబడ్డెయ్. మీ మామగారు వుద్యోగంచేస్తూ వూళ్లూళ్ళు తిరగటం, అది దాని నాయనమ్మ దగ్గిరే వుంటూవచ్చింది. ఆ యిల్లుకూడా దాని నాయనమ్మ యిచ్చిందే. కొడుకు కెవ్వరికి యివ్వకుండా - వాళ్ళతో విరోధంకూడా పెట్టుకొని - దానిపేర రిజిస్టరు చేసేసింది. ఏదో సర్దుకపోవాలి నాయనా - అదికూడా యీ నాలుగురోజులనుంచి ఏడ్చిఏడ్చి..."

"ఎవరు ఏడవమన్నారు. తన యిష్టమొచ్చి తాను మాట్లాడితే నాకు కష్టమేసి పలకటం మానేశాను. దాని కెందుకు ఏడ్వటం"

"ఎంత తెలివితక్కువదైతేమాత్రం నీవామాదిరి పట్టుబడితే కష్టంగా వుండదట నాయనా—"

"వుండనీ - దానికెవరేం జేస్తారు. నేను వందసార్లు చెప్పాను. పిల్లల్ని వూరికే తిట్టవద్దు అని—ఆ తిట్లైనా రాగాలాపనతో ప్రారంభమయి - ప్రాసలు - అలంకారాలతో సాగిపోతూ - వుండవలసివచ్చె. వాటికి అంత్యమంటూ లేకపోయె. ఆ బాధపడేదానికన్న..."

"దాని మాటలంతే నాయనా! నాకు తెలుసు. యీ భయం యిక పోదులె. నీకెందుకు. మరలా ఆ మాట లెప్పుడు ప్రారంభిస్తుందో అప్పుడు నాకు కార్డు రాయి. దాని పని నేను చెపుతా—"

కామేశ్వరరావు దాని కేమీ బదులు చెప్పలేదు. లక్ష్మమ్మ తన యింటి సంగతులు గొడవగా చెప్పసాగింది అల్లుడికి.

రాత్రి భోజనాలయిన తర్వాత అందరూ తాంబూలం వేసుకుంటున్నారు. పిల్లలు నిద్రపోయ్యారు.

"మొన్న యింటిబాడుగ వస్తే యిచ్చేశారు. యిక తీసుకోరట." కమలమ్మ తన తల్లిపక్కన కూర్చొని భర్తవంక చూస్తూ చిరునవ్వుతో అన్నది.

"నీ వేమంటే యిచ్చేశాడో—ఏం నాయనా! ఏమన్నదేం"

"యీ కొంపకు నేను పెట్టిందే జరగదనో - యేమో - అన్నది. డబ్బు రాగానే యిచ్చేశాను."

"ఏమే ఆ మాటన్నావూ? యిదెవరి యిల్లే - నీ యిల్లు కాదూ? అయినా నీయంటి తెలివితక్కువదాన్ని కట్టుకొని యేగేదానికి మప్పై కొదు యీభైఅయినా యివ్వొచ్చు."

"నీవూ అట్టనే అనవే అమ్మా! నన్నిక సాధిస్తారు. ఆ డబ్బు అప్పుడే గుడ్డలకొట్టోడికి పంపేశానులే—"

"మంచి ఘనకార్యం చేశావు. యికనైనా బుద్ధి తెచ్చుకొని—ఆలోచించి మరి మాట్లాడు—" ★

సీరియల్ నవల

# రెండు మహా నగరాలు

చార్లెస్ డికెన్స్

## 38

నాలుగో రోజు ఉదయంవరకూ, డాక్టర్ మానెట్ యింటికి తిరిగి రాలేదు. ఈ నాలుగు రోజుల్లోనూ పారిస్‌లో యెంత గందరగోళమో జరిగిపోయింది. మగా, ఆడా, మొత్తం పదకొండు వందలమంది ఖైదీలను జనం పడి హత్య చేశారు. ఆ కిరాతచర్య నాలుగు రాత్రులూ నాలుగు పగళ్ళూ నిర్విరామంగా సాగిపోయింది. కాని యీ సంగతులు లూసీకి రవ్వంతైనా తెలియకుండా లారీ, డాక్టరూ కలిసి మభ్యపెట్టారు. ఏదో గలంతు సాగిందనీ, జనం కొంతమంది రాజకీయ ఖైదీలను చంపారనీ చెప్పారే గాని, యింత ఘోరం జరిగిపోయిందని లూసీకి తెలీదు.

జరిగిన సంగతంతా డాక్టర్ లారీగారి చెవిలో రహస్యంగా చెప్పాడు. మానవ పశువులను కబేళాపశువులను నరికినట్లు తలలు తెగగొడుతున్న రంగంమధ్యనుంచి డాక్టర్ మానెట్‌ను దేశభక్తులు లాఫోర్స్ జైలుకు తీసుకువెళ్లారు. లాఫోర్సు జైల్లో తనంత తానుగా స్వంత బాధ్యతమీద యేర్పాటైన విచారణసంఘం ఒకటి వుంది.

ఆ కోర్టు నిమిషాలమీద ఖైదీలను విచారించి తీర్పులు చెప్తేస్తూవుంది. కొందరిని హత్య చేయబడవలసినవారుగా శిక్ష విధించి జనానికి ఒప్పగింత పెట్టేస్తుంది. కొద్దిమంది నెవర్నో విడుదల చేస్తుంది; తక్కినవాళ్ళని మళ్ళీ జైలు కొట్లల్లోకి తిప్పి పంపుతూ వుంటుంది. డాక్టర్ మానెట్‌ను వెంటబెట్టుకుని తీసుకువెళ్లిన దేశభక్తులు ఆయన్ను ఈ విచారణసంఘంవారికి పరిచయం చేశారు. డాక్టరుగారు తన పేరూ, ఊరూ, గతంలో తాను అనుభవించిన కష్టాలూ విచారణసంఘానికి స్వయంగా నివేదించుకున్నాడు. విచారణా బండలూ ఏమీ లేకుండా తనను 18 సంవత్సరాలపాటు బాస్టిలీ ఖైదులో పారేసి హతమార్చారనీ మాజీ పరిపాలకుల చేతుల్లో అష్టకష్టాలూ పడ్డాననీ చెప్పుకున్నాడు. ఆ విచారణ సంఘంలో కూర్చున్న ఒక పెద్దమనిషి లేచి, తాను డాక్టర్‌గారిని యెరుగుదుననీ, ఆయన చెప్పిందంతా నిజమేననీ రూఢీ పరిచాడు. ఆ పెద్దమనిషి డిఫార్జ్.

తరువాత డాక్టరుగారు మళ్ళీ మొరబెట్టుకున్నాడు తన అల్లుడు ఖైదీగా వున్నాడనీ తనమీద కనికరించి అతన్ని విడుదల చేయించమనీ; ఆ విచారణ సంఘంలో వున్న కొంతమంది సభ్యులు నిద్రపోతున్నారు; కొంతమంది మేలుకునున్నారు; కొంతమంది మురికిగా వున్నారు; మరి కొంతమంది కులాసాగా వున్నారు.

కూలదోయబడిన మాజీప్రభుత్వంవల్ల బాధలుపడ్డ మహా దేశభక్తుడుగా డాక్టర్‌గారిని అభినందించే వీరావేశపు మొదటి ఊపులో డార్నేను వెంటనే హాజరుపెట్టవలసిందిగా [illegible] హుటాహుటిని ఉత్తరవులు జారీచేయబడినై. అతన్ని వెం.. నే విడుదల చేసేస్తారనిపించింది. కాని మరుక్షణంలోనే, ఆ ఆవేశ ప్రవాహం యెందుకో పెడదిరిగిపోయింది. సంఘసభ్యులలో ఏదో చిన్న గుసగుస; ఆ సంగతేమిటో డాక్టరుకు అర్థంకాలేదు. ఖైదీ యింకా కొంతకాలం జైల్లోనే వుండాలనీ, అయితే అతనికి ప్రాణభయం లేకుండా, జాగ్రత్తగా చూస్తారనీ విచారణసంఘం అధ్యక్షులు డాక్టర్‌గారికి తెలియజేశాడు. ఈమాట డాక్టర్‌గారికి చెబుతూనే చేసన్న చేయటంతో, వార్డర్లు వెంటబెట్టుకొచ్చిన ఖైదీని మళ్లా వెనక్కు తీసుకువెళ్ళిపోయారు. డాక్టర్ మళ్ళీ గోలబెట్టాడు. ఏ కారణంచేతగాని తన అల్లుణ్ణి బయట జరుగుతున్న హననకాండకు ఒప్పగింత చేయవద్దనీ, ఆ గందరగోళం ముగిసిపోయేవరకూ తాను కూడా అక్కడే ఉండిపోవటానికి అనుమతి యిప్పించమనీ. కోర్టువారు కరుణించి అలాంటి అనుమతి దయచెయ్యటంతో ఆ గందరగోళం ఉపశమించేవరకూ, ఆ నరపశువుల కబేళాలోనే ఉండిపోయారు.

ఆ కథ యావత్తూ లూసీకి చెప్పవద్దని డాక్టర్ లారీగారి దగ్గర హామీ తీసుకున్నాడు. విడుదలైన దేశభక్తులయెడ చూపే ఆనందకోలాహలంకంటే చిత్రవధ చేయబడుతున్న ఖైదీలపట్ల జనం చూపుతున్న వీరావేశం చూసి డాక్టర్ చకితుడైనాడు. ఆయన లారీతో యింకా చాలా సంగతులు చెప్పాడు. ఒక ఖైదీని కోర్టువారు విచారించి నిర్దోషిగా తేల్చి విడుదల చేశారు. ఆ వ్యక్తి జైలుగేటు దాటి వీధిలోకి అడుగు బెట్టాడో లేదో, వీధిలో వీరవిహారం చేస్తున్న కిరాతుడు, పొరపాటున అతనిమీద బల్లెం విసిరేశాడు. అతని గాయానికి కట్టుగట్టి చికిత్స చెయ్యటానికి డాక్టర్ మానెట్‌ను రమ్మన్నాడు. డాక్టర్‌గారు వీధిగుమ్మంలోకి వెళ్లి చూసేసరికి, అక్కడున్న కరుణామయులు, తాము నరికి గుట్టబోసిన మానవ కళేబరాల గుట్టమీద ఈ క్షతగాత్రుణ్ణి ఒళ్లో బెట్టుకుని విచారంగా కూర్చున్నారు. భీభత్సకరమైన ఆ అభాసా ప్రవర్తన యేమిటో డాక్టరుకు పాలుబోలేదు. డాకరుగారు ఆ గుట్టమీది కెక్కి ఆ వ్యక్తికి కట్టుకడుతున్నంతసేపూ వాళ్లెంతో జాలి పడుతూ ఆయనకు సాయపడ్డారు. డాక్టరు కట్టుకట్టటం పూర్తి గావటంతోటే, అతన్ని పల్లకి గట్టుకుని యింటికాడ దిగబెట్టి వచ్చారు; తిరిగి వచ్చిరావటమే మళ్ళీ కత్తులూ కటార్లూ బుచ్చుకుని యథాప్రకారం మానవ హననకాండకు తిరిగి యెగబడ్డారు. ఆ దృశ్యాన్ని చూడలేక డాక్టరు అరచేతులతో రెండు కళ్ళూ మూసేసుకుని ఆ జనం మధ్యలోనే మూర్ఛపోయాడు.

డాక్టర్‌గారు యీ చిత్రగాథలు చెబుతున్నంతసేపూ, లారి

అనువాదం: తెన్నేటి సూరి

# కోలినాస్

## ప్రకృతియొక్క ఆకుపచ్చ క్లోరోఫిల్ గలది

...మీ దంతధావనంలో యింతకు ముందెన్నడు లేని గొప్ప పురోగమనం!

మొక్కలను తాజాగా ఆకుపచ్చగా ఉంచు ప్రకృతి సిద్ధమైన క్లోరోఫిల్‌తో...నోటి దుర్వాసనను రోజంతా పోగొట్టుకొనుడు...దంతక్షయమును చిగుళ్ల బాధను ఆపుకొనుడు!

నిస్సందేహంగా మీకింతకు పూర్వమెన్నడు లభించని అమోఘమగు దంతరక్షణ యిదియే! క్లోరోఫిల్ గల అద్భుతమగు క్రొత్త కోలినాస్ దంతక్షయమును రోగ క్రిములను నాశనము చేయుటయేగా నోటి దుర్గంధము ఒక రోజంతా లేకుండ చేయును....ఇది మొక్కలను పచపచగా తాజాగా ఉంచు ప్రకృతి సిద్ధమైన రసాయనిక పదార్థమగు ఆకుపచ్చని క్లోరోఫిల్ వల్లనే. క్లోరోఫిల్ గల కోలినాస్ అమోఘమైనదగుటయే గాక పొదుపు కూడా. పొడి బ్రష్ మీద అరంగుళమే చాలు. ఆకుపచ్చని అట్టపెట్టెలో అన్ని దుకాణాలలో దొరకును. నేడే కొని దంతశాస్త్రంలోకెల్ల అపూర్వపు రోగమనంవల్ల కలిగే లాభములను పొందండి!

క్రొత్త ఆకుపచ్చ అట్టపెట్టెను గమనించుడు.
స్టాండర్డ్ కోలినాస్ (పసుపుపచ్చ లేబిల్ కలది) కూడ లభించును.

**2,000 అమెరికన్ దంతరోగులు క్లోరోఫిల్ యొక్క సత్ఫలితములను నిరూపించుచున్నారు.**

నాలుగు సంవత్సరముల పరిశోధన, దాదాపు 2,000 అమెరికన్ రోగులపై యింతకు ముందెన్నడు జరుపబడని అత్యంత పెద్ద పరీక్షలవల్ల రుజువైన దేమంటే. క్లోరోఫిల్ గల డెంటల్ క్రీమ్

- చిగుళ్ల సామాన్య జబ్బులన్నిటిని అరికట్టును
- నోటి దుర్గంధములను ఒక రోజంతయు పూర్తిగా పోగొట్టును
- దంతక్షయ క్రిములను అమోఘంగా నాశనం చేయును

మీ దంత వైద్యునకు ఈ శోధనలన్నియు తెలుసు. ఆయన యీ ఫలితములను నిర్ధారణ చేయగలడు.

* * *

★ నోటి దుర్గంధములను పోగొట్టును

★ చిగుళ్లకు పటుత్వము నిచ్చును

★ దంతక్షయమును అరికట్టును




భారతదేశంలో తయారు చేయువారు: జ్యాఫ్రే మానర్స్ & కం. లి. బొంబాయి 1

GK 7131

# రెండు మహానగరాలు

ఆయన ముఖంలోకి చాలా పరిశీలనగా చూస్తున్నాడు. ఇలాంటి భయంకరమైన అనుభూతులతో, మళ్లా డాక్టరుగారి పాతవ్యాధి తిరగబెడుతుందేమోనని అతని భయం. కాని ఆయనలో అలాంటి చిహ్నాలేమీ కనుపించటంలేదు. డాక్టర్ అంత ధీమాగా వుండటం, లారీ అతఃపూర్వం యెన్నడూ చూడ్లేదు. గతంలో తాను అనుభవించిన యమయాతనంతా తన కిప్పుడు ఆత్మబలంగా పరిణమించిందని డాక్టర్ గ్రహించాడు; ఆ బలంతో, తాను జైలు కటకటాలను విరగదీసి పారేసి తన అల్లుణ్ణి బయటికి తెచ్చుకోగలననే ధీమాతో వున్నాడు:

'లారీగారూ! చూశారూ! మానవుడు కష్టా లనుభవించాడంటే అదంతా ఊరికే పోదు; అంతా మన మేలుకోసమే జరుగుతూ వుంటుంది. కష్టాలుపడ్డాను గనకనే ఇప్పుడు ఈ సదవకాశమంటూ లభించింది. చూడండి మరి నా దెబ్బ! నాతల్లి నన్ను యెలా ప్రజల్లో పడేసుకుందో, అలాగే భగవంతుడి దయ వుంటే, దాని బహిఃప్రాణాన్ని దానికి తిరిగి వప్పగింతజేసి, దాని ఋణం తీర్చుకుంటాను' అన్నాడు. ఆ మాటలధోరణి, ఆయన ముఖంమీద ప్రజ్వరిల్లుతూన్న ఆ నూతనోత్సాహం ఆ మనో నిబ్బరం చూసి లారీ ఆశ్చర్యపడుతున్నాడు.

నిజానికి ఆ తరుణంలో డాక్టరు, ఒక్క డార్నేను బయట పడేసుకునే విషయమే గాదు—ఏ కార్యాన్ని బడితే ఆ కార్యాన్ని సాధించగల స్థితికి వచ్చాడు. జైల్లో ఉన్న నాలుగు రోజుల్లోనూ అక్కడ యావన్మందికీ చికిత్స చేసే పనికి పూనుకుని, తన పలుకుబడిని చాలా తెలివితేటలుగా ఉపయోగించుకున్నాడు. ప్రజా ప్రభుత్వాధికారులు ఆయనను లాఫోర్స్ ఖైదుతోగూడా కలుపుకుని మూడు జైళ్లకు సూపరింటెండెంట్ వైద్యాధికారిగా నియమించారు. లూసీని పిల్చి ధీమాతో చెప్పాడు:

'ఇదిగో అమ్మాయి! ఇటు విను—నీ మొగుడు ఇక ఒంటరిగా ఖైదుకొట్లో వుండవలసిన పనిలేదు—పదిమంది ఖైదీలతోనూ కలిసి పెద్దహాల్లో కులాసాగా కాలక్షేపంచేసే యేర్పాటు చేశాను.' డాక్టర్ గారు వారం వారం వెళ్లి అల్లుణ్ణి చూసి వస్తూవుండేవాడు. అల్లుడిదగ్గరనుంచి కూతురుకు యేదో మధురమైన వర్తమానం ఒకటి తెచ్చి అందజేస్తూవుండేవాడు. ఒక్కొక్కప్పుడు డార్నే లూసీకి ఉత్తరాలుకూడా పంపుతూవుండేవాడు. లూసీని మాత్రం సమాధానం వ్రాయనిచ్చేవారు కాదు. ఎంచేతనంటే, విదేశీయులతో సంబంధంవున్న పరారీదార్లంటే జైల్లో చాలా అనుమానంగా చూస్తున్నారు.

డాక్టర్ గారి ఈ నూతన జీవితం ఆందోళనతో కూడుకున్నదనటంలో సందేహంలేదు. కాని దాల్లో ఒక వినూత్నమైన ఆత్మవిశ్వాసంకూడా వున్నట్లు లారీ అవగతం జేసుకోగలుగుతున్నాడు; డాక్టర్ ఆత్మవిశ్వాసానికి భంగం కలిగించే సంఘటనలు కూడా యేమీ తటస్థించటం లేదు. ఇతఃపూర్వం డాక్టరుధోరణికీ యిప్పటి ధోరణికీ చాలా తేడా వుంది. లోగడ ఆయన యేన్నో చిక్కులు బడ్డాడు. లూసీ, లారీ మొదలైన యితరులవల్ల ఆయన వాటిల్లోనుంచి బయటపడ్డాడు. వాళ్ళు తనకంటే సత్తాగలవాళ్లనే అభిప్రాయం ఆయన మనస్సులో వుండేది. ఇప్పుడు ఆ పరిస్థితి యావత్తూ మారిపోయింది. ఇప్పుడు తనకు అనంతమైన బలసంపన్నత కల్గింది. లూసీ మొదలైన యితరులు తన ప్రతిభాసంపత్తుల మీద ఆధారపడవలసిన వాళ్లుగా మారారు. ఇదీ ఆయనలో కలిగిన కొత్త ధీమా. అందుచేత ఆ బలహీనులను సంరక్షించేటందుకు ధీమాగా ప్రయత్నించుతున్నాడు.

కాని, డాక్టర్ యెంత తీవ్రంగా కృషిచేస్తున్నా డార్నేను విడుదలచేయించలేకపోతున్నాడుసరేకదా, విచారణ జరిగే యేర్పాటుకూడా చేయించలేకపోతున్నాడు. బలీయమైన ప్రజావేశం ముందడుగు పడకుండా ఆయనకు అడ్డుతగులుతోంది. నూతనశకం ప్రారంభమైంది. రాజును విచారణచేసి తల నరికేశారు; యావత్ప్రపంచం సాయుధంగా యెత్తివచ్చినా, విజయమో మరణమో తేలవలసిందేగాని మరో మార్గం లేదని స్వాతంత్ర్య రిపబ్లిక్ ప్రకటించింది. నాటర్ డేమ్ గోపురాలమీద పగలూ రాత్రీకూడా నల్లజండాలు ఎగురుతున్నయ్. జగత్కంటకుల నిరంకుశత్వాన్ని కూలద్రోయటానికి 3 లక్షలమంది ఫ్రెంచి ప్రజలు సాయుధపాణులై రణక్షేత్రంలోకి దూకేరు. ఫ్రాన్సు భూభాగమంతా విప్లవబీజాలు మొలకలెత్తిపోయినై. నిరంకుశత్వం ఫ్రాన్సు గడ్డమీద వెదబట్టిన విత్తనాలన్నీ బీరుపోకుండా మొలిచి అదే నిరంకుశ పంథాలో ప్రతిహింసకు ఉపక్రమించినై.

పారిస్ రాజధానిలో ఒక విచారణసంఘం. దీనికి అనుబంధ శాఖలు దేశం మూలమూలలా నలభై యాభై వేల ప్రజాకోర్టులు. ఫ్రాన్సులో గెలొటైన్ అనే నారీపిశాచి ప్రభవించింది. నరజాతిని తలలు నరికి ఆహరించి పారేస్తోంది.

చుట్టూ ఇంత భీభత్సంగా వున్నా, వీటిమధ్య డాక్టర్ మానెట్ మొక్కవోని ఆత్మవిశ్వాసంతో తలెత్తుక తిరుగుతున్నాడు. ఎప్పటికైనా డార్నేను జైల్లోనుంచి బయటపడేసి తీరగలను అనుకుంటున్నాడు. ఇలా అనుకుంటూ వుండగానే పదిహేను నెలలు గడిచిపోయాయి. డార్నే యింకా జైల్లోనే వున్నాడు. 

"ఏమండీ; పిన్నిగారూ! మీరు ఏమి మాట్లాడుతున్నారో ఆలోచించుకునే మాట్లాడుతున్నారా?"

"అదేమిటమ్మా! ఎట్లా ఆలోచించుకో మంటావూ? నే మాట్లాడిం దేదో నాకు ముందుగా వినిపిస్తే కదా ఆలోచించుకోవటానికివీలు!"

# రట్టూ-గుట్టూ

శ్రీ రావి కొండలరావు

[ఖాళీగా వున్న ప్రదేశం-అంటే స్టేజిమీద ఏ వస్తువూ వుండదు. రెండు నిముషాలు పోయిన తర్వాత 'గుట్టు' అనే వొకడు ఎడంవేపునుంచి వచ్చి కుడివేపు చూస్తూ నడుస్తూవుంటే-కుడివేపునుంచి 'రట్టు' అనే మరొకడు వొచ్చి ఎడంవేపు చూస్తూ వొచ్చి ఎడం చివర నించున్నాడు. గుట్టు కూడా కుడి చివరకు వెళ్ళి ఆగి కుడిలోకి చూస్తున్నాడు. ఇద్దరూ వొకర్ని వొకరు దాటుకున్నా ఎవరూ ఎవర్నీ గమనించరు.]

గుట్టు: హే-వీడి సంగతా-వీడికీ నాకూ మాటలేమిటి? 'మతిలేని మనిషితో మాటలెందుకురా' అన్నాడు. (ఆలోచిస్తున్నాడు)

రట్టు: వీడిసంగతీ వీడూనూ - వీడితో నాకు సంభాషణా? ఛా...ఛా...(ఆలోచిస్తున్నాడు)

గుట్టు: వొస్తే వొచ్చిందయ్యా తగువూ-తగువురానివాడెవడు ఈ ప్రపంచంలో? సాక్షాత్తూ విష్ణుమూర్తిలాంటివారికే లక్ష్మీదేవమ్మతో చీటికీ మాటికీ కయ్యాలొస్తున్నాయి. అటువంటిది వొక మానవుడికీ-నాకూ వొస్తే వొస్తుంది పోట్లాట-దాన్లో ఏముంది ఘనత?-

రట్టు: తగూలాడుకోటంలో ఘనత ఎందుకుంటుందీ? చంటిపిల్లలనుంచీ పెద్దవాళ్లదాకా కీచులాడుకుంటూనేవుంటారు. అదెక్కడో కొరియా అనే వొకదేశం-దాంతో అదే పోట్లాడుకుంటున్నదట-లావుంది. అట్లాంటిది వాడికీ నాకూ దెబ్బలాట రావటంలో ఆశ్చర్యం లేదు.

గుట్టు: అవునయ్యా-కొట్లాడుకున్నాం. ఐతే అయింది. అంతమాత్రాన నలుగురూ—చేరి మా యిద్దర్నీ మళ్లీ కలియమంటే ఎట్లా?-అది వీలుకాని విషయం.

రట్టు: (ఆలోచించి) వీలుకాని విషయమే. తిట్టుకునీ కొట్టుకునీ మళ్లీ ఏమొహాలతో మేం కలుస్తాం? ఇంపాసిబుల్...

గుట్టు: నోపాసిబులిటీ-మేం మళ్ళీ కలియలేం' అది వీలుకాదు హరిమీద గిరి పడినా సరే-

రట్టు: ఈ ప్రపంచంలో-అనేక కోటానకోట్ల మానవులున్న ఈ విశాలప్రపంచంలో 'గుట్టు'అనే వో మనిషికూడా ఏడిశాడు. వాడూ నేనూ వొకప్పుడు ప్రాణస్నేహితులం. ఏదో విషయానికి పేచీ వొచ్చి పోట్లాడుకున్నాం. వూళ్లోవాళ్లు నాదగ్గిరకొచ్చి వాడితో తిరిగి-వళ్ళి కలియమంటారు...హెహ్హె...పూర్ ఫెలోస్...పౌరుషం వున్నవాడెవడూ మళ్లీ వొకడితో విడిపోయిన తర్వాత కలియడు.

గుట్టు: కలియలేదుకలియలేదు-ఈ గుట్టు మళ్లీ వెళ్ళి ఆ 'రట్టు'గాడితో కలియలేదు-ఇది పౌరుషకుటుంబం-ఏమిటో అనుకుంటున్నాడు కాబోలు.

రట్టు: వొకవేళ ఆ గుట్టుగాడే నాదగ్గిరకొచ్చి బ్రతిమాలుకొని-కాళ్లు పట్టుకుని-"వొరే "రట్టూ-నీతో నేను స్నేహంగా వుంటానురా-మళ్ళీ మనం స్నేహితులుగానే వుందాం" అన్నాడనుకుంటే-అనుకున్నా జరిగినా-'పోరా ఇడియట్' అని కాళ్లు విదిలించుకుంటాను కాని కావలించుకుంటానా?-ఛాఛా...

గుట్టు: వాడే నాదగ్గిరకొచ్చి రక్షించమన్నా రక్షించను. వాడితో తిరిగి కలియను. నా సంగతి వాడికేం తెలుసు?... అన్నట్టు వాడు ఇంటిదగ్గిరే వుంటాడు-వెళ్తే?...వెళ్తే తప్పకుండా నన్ను కోరుకుంటాడు కాని-నేనుమాత్రం వొప్పుకోను. మరి వొప్పుకోకపోయినంతమాత్రాన వాడికి నష్టంకలుగుతుందా? కలుగుతుంది. కలిగినా నేను వొప్పుకోను. వొప్పుకోనుకాబట్టి వాడిదగ్గిర కెందుకూ వూరికే పోవటం?-కాళ్ళునెప్పి-

రట్టు: గుట్టూ నేనూ నిన్న సాయంత్రం ఆరోగంటకి కాఫీహోటల్లో తిన్నాం. ఇద్దరమూ సరిగ్గానే తిని-సరిగ్గానే బిల్లులు చెల్లించాం.

అట్లాంటిది ఇవాళ-ఇప్పుడు ఇదరమూ విడిపోయినాం. కాలం ఎంత కల్మషంతో వుంటుంది?

గుట్టు: ఇద్దరు స్నేహితుల్ని క్షణంలో శత్రువులుగా చేస్తాడు - భార్యాభర్తల్ని నిమిషంలో విడదీసి కయ్యం పుట్టిస్తాడు-హాయిగావుంటే ప్రేయసీప్రియుల్ని అర సెకండులో ఎడబాటుచేసి వాళ్లని ఏడిపించి వాళ్ల వుసురుపోసుకుంటాడు-ఏం బ్రహ్మ! ఏంబ్రహ్మయ్యా నువ్వు?-అంతా నీమయం. వొకసారి నిన్ను చూడాలయ్యా! వొస్తాను (వెనక్కి తిరిగి నడుస్తున్నాడు)

రట్టు: సరే పోతాను. (వెనక్కి తిరిగి నడుస్తాడు)

(ఇద్దరూ వొకర్ని వొకరు ఆశ్చర్యంగా చూసుకున్నారు)

గుట్టు: మళ్లీ ఎదురయ్యావ్?

రట్టు: అవును-అదే నేనూ అడగబోతున్నాను.

గుట్టు: ఏడిశావ్-నా మాట అది. నువ్వెట్లా అడగ్గలవ్?

రట్టు: పో పో-నీ దారిన నువ్వుపో. అనవసరంగా మాట లెందుకు?

గుట్టు: నా దారిన నేను పోతూవుంటేనే అపశకునపక్షిలాగా ఎదురుపాడిచావ్-సిగ్గులేని మొహానివి కాబట్టి-

రట్టు: నువ్వు సిగ్గున్నవాడివేనా ఏమిటి మహా? వొకవేళ నేను ఎదురయ్యానే అనుకో-నువ్వెందుకు నాకు ఎదురవాలి?

గుట్టు: నీకు నేను ఎదురు రాలేదు.

రట్టు: నేనూ నీకు ఎదురు రాలేదు.

గుట్టు: ఐతే పో-నీ దారమ్మట-

రట్టు: నువ్వేపో-

గుట్టు: ఏమాటకి ఆమాటే-

రట్టు: అవున్నేరా భాయ్-పోనీ పోదూ-

గుట్టు: నేను పోను.

రట్టు: పోకపోతే వుండు. నావీధి కాదుగా- ఈ వీధిలో ఎన్నికుక్కలులేవు తిరుగుతూ!

గుట్టు: ఎన్ని గాడిదలో ఎక్కడ పడితే అక్కడే వున్నయ్-

రట్టు: ఔనా. అదే అంటున్నాను. గాడిద గొప్పదో-కుక్క గొప్పదో తెలుసా? కుక్క గొప్పది కాదు. గాడిద బరువుమోస్తుంది.

గుట్టు: దాని బ్రతుకంతే- బరువులు మోసుకోటమే-కుక్క విశ్వాసంగల జంతువు.

రట్టు: దాని బ్రతుకు ఇల్లుకాయటమే-

గుట్టు: కాస్తే కాస్తుంది-



"హే! వీడి సంగతా—వీడికీ నాకూమాటలేమిటి ?"
"వీడి సంగతీవీడూనూ, వీడితో నాకు సంభాషణా ?"

రట్టు: మోస్తే మోస్తుంది.

గుట్టు: (వొకపక్కకి తిరిగి) ఇల్లుకాసే కుక్క గొప్పదా-మూటలుమోసే గాడిద గొప్పదా?-కుక్కగురించి నేను వొకటో తరగతిలోనే చదివాను. 'కుక్క విశ్వాసం గల జంతువూ' అంటాడు. కుక్క కథలు బోలెడున్నయ్.

రట్టు: (ఇంకో ప్రక్కకి తిరిగి) కుక్క అంత వెధవజంతువు మరిలేదు. దానిబుద్ధి దానికి పోదు. అందుకేగా-'కనక పుసింహా సనమున' అన్నాడు-

గుట్టు: టాపిక్ కుక్కల్లోకి వొచ్చిందే మిటి? నాన్సెన్స్-

రట్టు: (ఆలోచిస్తూ) కుక్కలు ఎంగిలాకులూ ఎండిన ఎముకలూ తింటాయి. వాటికి జ్ఞానం లేదు.

గుట్టు: (ఛటాలునతిరిగి) ఏమన్నావురా-కుక్కకి జ్ఞానంలేదూ? "కుక్క పిల్లా-సబ్బు బిళ్లా-అగ్గిపుల్లా-దేన్నీ హీనంగా చూడకు" అన్నాడు వొకవి. నీకేం తెలుసు? ఇంకా మాట్లాడితే ఆయనతో రిపోర్టు చేస్తాను. తెలిసిందా? తీరిగ్గా నించుని కుక్కను తిడుతున్నావ్-సాహిత్యంలో కుక్క కథలే ఎక్కువగా కనుపిస్తయ్ తెలుసా?- ఆమాటకొస్తే కుక్క దేవుడు!

రట్టు: నీ మొహం!

గుట్టు: నా మొహం కాదు-కుక్కను ఇంగ్లీషులో డాగ్ అంటారు. డివోజీ అని దాని స్పెల్లింగు-

రట్టు: నేనూ చదివాలే-

గుట్టు: చదివితే మరేం? తిరగెయ్యి వోయ్ డివోజీ నీ-జీవోడీ-గాడ్-గాడ్ అంటే తెలుగులో దేవుడు.

రట్టు: వోహోహో-గొప్ప తెలివి! గాడ్ అన్నది ఇంగ్లీషు. నువ్వు తెలుగువాడివి.

గుట్టు: నాకు ఇంగ్లీషు వొచ్చును.

రట్టు: వొచ్చినంతమాత్రాన తెలుగు వాడివి కాకపోయావా?

గుట్టు: కావొచ్చు కాని-నేను దేవుడితో సమానమని నువ్వు వొప్పుకున్నావు.

రట్టు: ఛీ ఛీ-నువ్వేం దేవుడివి? నీ మొహం-

గుట్టు: వోర్నీ తెలివి! ఇంతేనా? చెప్పింది వింవిన్నావ్?

రట్టు: సరేగాని-ప్రజలు మనల్ని మళ్ళీ కలియమన్నారు-తెలుసా?

గుట్టు: ఆఁ ప్రజలకేం-లక్ష అంటారు-కోటి అంటారు కూడా-ఏమీ-వాళ్లు కోటి మంది వున్నారు-కోటానకోట్లున్నారు-

రట్టు: అందుకే వాళ్లమాట వినమన్నాను.

గుట్టు: ఛవ్! నాకు వొకడిమాట వినే అజ్ఞానంలేదు. నాకు తెలివితేటలున్నయ్. అవి వుపయోగిస్తాను.

రట్టు: వుపయోగించుకో-అసలు వుంటేగా?

గుట్టు: రట్టూ! ప్రజలు నాతోకూడా అదే అన్నారు.

రట్టు: ఏది?

గుట్టు: మనల్ని కలియమని.

రట్టు: ఐతే కలుస్తామా?

గుట్టు: కలియం-

రట్టు: అవును ఛస్తే కలియం.

గుట్టు: ప్రజలు ఎందుకు చెప్పాలి మరి?

రట్టు: వెళ్లి అడుగు వాళ్ళని.

గుట్టు: అడగను కాని-వొకటి. వాళ్లు మనం కలియకపోతే తంతారేమో!

రట్టు: అబ్బే-అదంతా నీ భయమే-వాళ్లు ఎక్కడితంతారు?

గుట్టు: ఐతే తన్నరంటావా? (కొద్దిసేపు ఆలోచించి-అటు తిరిగి) ఇదేమిటి నేనూ-వీడితో మాట్లాడేస్తున్నానేమిటి? నా మొహం-

రట్టు: (అటు తిరిగి) అవునూ-వీడితో నాకు మాటలేమిటి! ఛ ఛ...మరి మాట్లాడను-

గుట్టు: వొరేయ్ భాయ్-నేను నీతో మరి మాట్లాడనురా-

రట్టు: నేనూనూ-నేను మాట్లాడితేకదా నువ్వు మాట్లాడేది?

గుట్టు: అయినా సరే-మనకు చెల్లుబడి లేదు.

రట్టు: థాంక్స్-వొద్దులే-

పిరికి తనం పాలు ఎక్కువగావున్న పడుచు కుర్రాడొకడు పెద్ద మనుష్యుల యింటికి టీపార్టీకి వెళ్లాడు. పార్టీలో అందరూ ఆయింటి యజమానిగారి అందమైన కూతురు చుట్టూమూగి తెగ పొగుడుతున్నారు. ఈ కుర్రవాడికి తను కూడా ఆ అమ్మాయితో మాట్లాడాలని మహా యిదిగా వుంది. కానీ - మాటలు దొరకక తికమక పడుతున్నాడు. ఇంతలో ఆ అమ్మాయే యితన్ని అడిగింది. —

"ఏమండీ: మీరు టీపార్టీలో ఏమీ తిన్నట్లే లేదే." అని.

"ఎబ్బె! హె...హె...హె...మీలాంటి వారిని చూశాక, యిక ఏదీ తినబుద్ధి పుట్టదనుకోండి. హి...హి...హి!" అన్నాడట.

# రట్టు గుట్టు

గుట్టు: నువ్వూ నేనూ ఈ జన్మలో కలియం–

రట్టు: ఈ జన్మేనా? ఎన్ని జన్మల్లోనూ కలియం.

గుట్టు: నాకూ నీకూ చెల్లు!

రట్టు: అవును–

గుట్టు: ఇంక పో–

రట్టు: నువ్వే పో–

గుట్టు: ఈ వీథేం నీది కాదు లే–తోర్కొయ్–

రట్టు: నీదా మరి? చాలించు–

గుట్టు: నీదీకాదు నాదీకాదు.

రట్టు: ఐతే ఎవరికీ హక్కు లేదు.

గుట్టు: కానీ నా ముందు నీ మొహం వుంచకు–

రట్టు: నువ్వే ఆ పని చెయ్యిరా–

గుట్టు: వోరె గిరె అంటున్నావేంరా రాస్కెల్–

(ఇద్దరూ వొకరి దగ్గరగా ఇంకొకరు వొచ్చారు. ఇద్దరూ వొక్కసారే కోపంగా గట్టిగా తిట్టుకుంటున్నారు. 'ఇడియెట్-ఫూల్-డామిట్' మొదలయినవి.)

(బాటసారి వొకాయన పరుగెత్తుకొచ్చాడు[

బాటసారి: అరెరే–ఏమిటీ గోల? ఎవరు మీరు?

(వాళ్లు వినిపించుకోలేదు. ఇద్దర్నీ ఆయన విడదీసి మధ్యలో దూరి)

బాటసారి: ఏమయ్యా-ఏమిటీ గోల?

రట్టు: గోలా? మేం తిట్టుకుంటున్నాం–

గుట్టు: ఏమనుకున్నావో ఇంగ్లీషున–

బాట: బావుంది బావుంది. ఇదేం గోల? పొండి–

రట్టు: పో పో–నువ్వే పో–ఎక్కడినించి వొచ్చేవో–

గుట్టు: ఎవడు రమ్మన్నాడు నిన్ను?

బాట: ఐతే సరేగాని–మీ రెందుకు తిట్టుకుంటున్నారు?

గుట్టు: చెప్పమంటావా?

రట్టు: విను–

గుట్టు: వాడూ నేనూ కొన్నాళ్లు గాఢ స్నేహితులం–

రట్టు: ఇప్పుడు పరమశత్రువులం–

గుట్టు: ప్రజలు మళ్లా మమ్మల్ని కలియమన్నారు–

రట్టు: ఛస్తే కలియం పొమ్మన్నాం.

బాట: ఐతే మరెందుకీ పోట్లాట?

గుట్టు: మేం శత్రువులమయ్యా.

రట్టు: శత్రువులం–

బాట: ఐతే?

గుట్టు: అందుకేమరి-ఏంచేస్తున్నావ్?

బాట: తప్పునాయనా–వెళ్లి సుఖంగా వుండండి.

రట్టు: మేం కష్టాల్లోవున్నామని నీకెవడు చెప్పాడు?

గుట్టు: నేను కాదు–

బాట: ఇద్దరూ కాదు. కానీ - వెళ్ళి హాయిగా వుండండి–అనవసరంగా పోట్లాట ఎందుకు?

రట్టు : మేం మరి కలియం అని చెప్పలా ?

గుట్టు : కలియం.

రట్టు : కలియం.

గుట్టు : అంతే!

రట్టు : ఆఁ

బాట : అదికాదయ్యా-ఎందుకు మీకీ దెబ్బలాట ? మీరు మళ్లా స్నేహితులుగానే వుండండి-విరోధం తప్పు-

గుట్టు : తప్పయినా-వొప్పయినా-

రట్టు : మేం మరి స్నేహితులంగా వుండం-

గుట్టు : అది మా దృఢనిశ్చయం-

రట్టు : బ్రహ్మదేవుడన్నా మమ్మల్ని కలపలేడు.

బాట : పోనీ, నామాట వినండి-

గుట్టు : బ్రహ్మనే కేర్ చెయ్యం అంటే నీలక్ష్యం ఏమిటి ?

రట్టు : నీదారిన నువ్వు పోవయ్యా-

బాట : అదికాదు. స్నేహంమంచిది-

గుట్టు : విరోధం చెడ్డదని మాకూ తెలుసు.

రట్టు : కాని మాయిద్దరిపట్లా అది వర్తించదు.

బాట : ఐతే నామాట వినరా ?

రట్టు : నీమాటా వినం-

గుట్టు : మేం కలియం కలియం-

బాట : వినండయ్యా-

రట్టు : వినకపోతే చెవుడయ్యా నీకు ?

గుట్టు : ఇక్కణ్ణుంచీ పో-మేం తిట్టుకోవాలి-

రట్టు : పోతావా లేదా ?

గుట్టు : పోరా-(తోశాడు)

రట్టు : పోరా అంటే (అట్నుంచి ఇటు తోశాడు)

బాట : ఏమయ్యా-మర్యాదా మంచీ లేదూ ? ఇదేమిటీ ఈ అల్లరి ?

గుట్టు : పొమ్మంటున్నాం-పోతావా పోవా ?

రట్టు : 'పోవా' అని కాదు-పోయితీరు-

బాట : నామాట వింటేకాని పోను-

గుట్టు : పోవూ ?

రట్టు : పోవూ ఐతేనూ ?

గుట్టు : నిజంగానే పోవా ?

బాట : అవును-నిజంగానే పోను.

రట్టు : వోరి రాస్కెల్-

గుట్టు : వోరి స్టుపిడ్-

రట్టు : నువ్వు పోకపోతే మానే య్-మేం ఇద్దరం కలిసి నిన్ను తన్నగలం-

గుట్టు : కలిసి తంతే నువ్వు ఈ ప్రపంచాన్నుంచే పోవాల్సివుంటుంది.

గట్టు : వొరేసుట్టూ-పోనీ కీళ్ళి చంపటంఎందుకు ? మనమే పోదాం పదరా-

గుట్టు : ఔను-ఇంకోచోటుకి మనమే పోదాం-

రట్టు : ఇదిగో - అక్కడికి గాని వొచ్చావా-చచ్చావే-

గుట్టు : ఇద్దరం కలిసి-

రట్టు : ఏకమై-

గుట్టు: వొకటై-

రట్టు : నీప్రాణం తీస్తాం-

గుట్టు : జాగర్త-పదరా రట్టూ-

రట్టు : పదరా గుట్టూ-

గుట్టు : మేం ఇద్దరం వొకటి. మమ్మల్ని మార్పించాలనుకుంటున్నావేమో-

రట్టు : ఛస్తే చెయ్యలేవు-పదరా (గుట్టు భుజంమీద చెయ్యివేశాడు)

గుట్టు : పద పద (రట్టు భుజం మీద చెయ్యివేశాడు. ఇద్దరూ వెళ్లిపోయారు)

బాట : (ఆశ్చర్యంగా) వోరి చవటలూ-(ఘకాలున నవ్వాడు)

తెరపడిపోయింది. ★

# ఎవరిది తప్పు?

నేను స్కూల్ ఫైనల్ ప్యాస్ అవగానే ఇంటర్‌మీడియెట్ చదవాలని నిశ్చయించుకున్నాను. వెంటనే ఒక సమస్య తలెత్తింది, ఎక్కడ వుండాలని? మూదసలే సామాన్యమైన కుటుంబము. వేరే కాపురము పెట్టి చదివే తాహతులేదు. ఇంటి అద్దెలా ఆకాశానికి అంటుతున్నాయి. అందుకని మా మేనమామగారింట్లో వుండి చదవమని, మానాన్న బలవంతము పెట్టడం చేత, అక్కడే వుండాలని నిశ్చయించుకున్నాను.

నేనంటే మా మేనమామకు అసలే గిట్టదు. నాకసలు చదువుకూడ రాదని జ్యోతిష్యం చెప్పాడు. అయినా, యెక్కడా తప్పకండాస్కూలు ఫైనల్ పూర్తిజేశాను. ఎక్కువగా చదివి మంచి ఉద్యోగంచేసి పోతానని, మావూరు కరణీకం చేసుకొని బతకమనేవాడు. 'ఏ ఉద్యోగంచేసినా, అంతకన్న యెక్కువ సంపాదించలేవు. ఊళ్ళో మంచిపేరు సంపాదించుకొని గౌరవముగా బ్రతకవచ్చు'నని నచ్చ చెప్పేవాడు. ఈకాలములో కరణాలకు గౌరవములేదని ఆయనకు తెలిసినా, నన్ను యింటిదగ్గఱనుండి కదలకండా చేయాలని పట్టుదలతో అట్లా చెప్పేవాడు.

నేను నిజాయితీగా నడవాలని అనుకునే వాళ్లలో ఒకణ్ణి. ఎవరైనా యేదైనా ఒకతప్పు చేస్తే ముఖానే అడిగే స్వభావము నాది. అందులో మా అమ్మతరఫువాళ్లు పితూరీలు చెప్పుతున్నా, మానాన్న తరఫువాళ్లను విమర్శించుతున్నా, నేను సహించి వూరుకొనేవాడిని కాను. అనవలసిన నాలుగు ముఖాన అడిగి, యివతలకు వచ్చేవాడిని. అందుకని నేనంటే నే వాళ్లకు గొంతువరకు కోపం. నేను అక్కడ వుంటానని తెలియగానే వారి కుటుంబ సభ్యులంతా ఒక సమావేశము జరిపారు, నన్ను వారింట్లో వుంచుకొనవలెనా! అక్కరలేదా? అనే సమస్య మీద. అందులో కొందరు జేర్చుకుంటె అనేక చిక్కులు వస్తవి కాబట్టి వద్దని చెప్పారు. మరి మా నాన్నగారు వుంచుతానంటే కాదనేదెలాగ? అని సంకోచంగా సెలవిచ్చారు. కొంత చర్చ జరిగిన తర్వాత మా అమ్మమ్మ చిక్కులు వచ్చినా తప్పేదేముంది అని చెప్పగానే సభికులంతా నన్ను జేర్చుకోటానికి తీర్మానించారు.

నేను కాలేజీలో జేరిన దగ్గఱనుండి వారింట్లోనే వుంటున్నాను. కాలేజీలో జేరిన మొదట అంతా క్రొత్తవటము చేత, స్నేహితులింకా యేర్పడకపోవడంచేత సాయంత్రము కూడ యింటివద్దనే ఉండేవాడిని. వాళ్ళకు యిష్టము లేకపోయినా యెంతో ఆప్యాయముగా, ప్రేమపురస్సరముగా మాట్లాడేవారు. నేను మా ఊరిలో నుండగా పదిమందితో తిరిగే అలవాటు. ఎప్పుడూ ప్రక్కన యెవరో ఒకరు మాట్లాడుతుంటేగాని తోచదు.

నేను ఉన్న యింట్లోనే, మరొక భాగంలో యింకొక మేనమామ భార్య, కొడుకులకు చదువు చెప్పించుకుంటూ ఉన్నది. ఆమెకు భర్త గతించి ఆరుసంవత్సరాలయింది. ఆమెకు భారత భాగవతాదులు చదివి అర్థం చెప్పగల సమర్థతున్నది. ఆమె కూడ తరచు మాట్లాడుతుంది నాతో. కాని ఆమె అంటే మా మేనమామకు, అమ్మమ్మకు అందరికీ అరికాలిమంట నెత్తికొస్తుంది. ఆమెను చూస్తుంటేనే కొరకొరలాడుతుంటారు. కాని పైకిమాత్రం తేనెపూసిన కత్తిలాగ, తప్పనిసరైనప్పుడు మాట్లాడుతుంటారు. ఆమెతో మరెవరు మాట్లాడుతున్నా చిర, చిరలాడుతుంటారు. మాట్లాడేవారిని చూసిన కోపముగానే యుంటుంది. ఆమెతో ఎవరు మాట్లాడకూడదు. ఆమెను వెలివేయాలని వారి ఉద్దేశ్యము. ఆమె చేసిన ప్రతిపనిని తప్పుగా భావించి, యేకరువు పెట్టేవాళ్ళనుచూస్తే, వాళ్ళకు పరమ సంతోషము. కావలసింది ఆమె చేసిన పనులను విమర్శించి ప్రచారంచేసి, ఆమెను దోషిగా నిరూపించడమే. ఆమెనుతిట్టుతూవుంటే, మా మేనమామవాళ్ళ కమితోత్సాహము. ఆమె కృశించి నశించుతుంటే వీళ్ళకు అమితానందం. కాని నాకుమాత్రం



ఆమెను చూస్తుంటే జాలివేసేది. ఆమెకు భర్తలేకపోగా, సుఖంగా తిని బ్రతకటానికి ఆస్తిపాస్తులా శూన్యం. చివరకు వుండటానికి యిల్లులేదు. భర్త సంపాదించి వదలిపోయిన డబ్బుతో కాలం గడుపుతున్నది. "డబ్బు అయిపోయిన తర్వాత గతేమిటా"ని యెప్పుడు యేడుస్తుంటుంది పాపం చాటుగా. ఆమెకు మానసిక దౌర్బల్యంవల్ల "హిస్టీరియా" వస్తుంటుంది. 'వంటచేసుకొనో, పంతులమ్మగనో' బ్రతకమని మా మేనమామ మాటలు అన్న తలపుకొచ్చినప్పుడల్లా, మరింత కుమిలి కృశించేది. చేసేదిలేక ఆమె వున్నంతలో పిల్లలకు పెట్టి, తను పస్తున్న రోజులుకూడ లేకపోలేదు. బొత్తుగా నిద్ర పోయేదికాదు. ఎప్పుడూ యేదో ఒక విషయాన్ని గూర్చి ఆలోచించుతూనే వుండేది. అటువంటి పరిస్థితులు చూస్తుంటే నాగుండె నీరయేది. కాని మా మేనమామకు, అమ్మమ్మలకు మాత్రం గుండె కరిగేదికాదు. కాగా ఎక్కువ సంతోషపడేవారు. అప్పుడను కున్నాను, పేదవారు దారికానక యేడుస్తుంటే, ఉన్నవారు కనికరించక సంతోషించుతారని. కలవారి గుండెలు చిట్టెపురాళ్ళని అనుకునేవాడిని. ఆమెతో మాట్లాడి ఓదార్చుదామని అనుకున్నాను. ఆమెతో తరచుమాట్లాడేవాడిని. ఈ విశాల ప్రపంచములో నేనొక్కడనే కనికరించి, ఓదార్చుతున్నానని, కాబోలు ఆమె చనువుగామాట్లాడేది. నాతో మాట్లాడుతుంటే, ఆమె కొంతవరకు బాధలను మరచిపోయేది. కాని మా మేనమామవాళ్లకు అగ్నిలో ఆజ్యం పోసినట్లయ్యేది. అందుకని ఆమె మీద, నామీదకూడ పగసాధించి వాళ్ళకు దాసులుగా చేసుకోవాలని చూస్తున్నారు.

ఒక నాడు మానాన్న వచ్చాడు నన్ను చూడటానికి, యేదోపనిమీద ఆవూరువచ్చి. మా మేమామతో మాట్లాడాడు చాలాసేపు. నేనప్పుడు ప్రక్కగదిలో ఉన్నాను. ప్రసంగవశాన ఎట్లా చదువుతున్నానని అడిగాడు.

"వాడు చదువుతున్నాడు త్రా," అయినా మామాట వింటాడా వాడు? ప్రొద్దస్తమానము వాళ్ళ అత్తయ్యతో మాట్లాడుతుంటాడు. ఏదో హోటల్లోలాగ భోజనం చేయటము, వాళ్లింటికి వెళ్ళటము. అది వాడి దినచర్య"అని చెప్పాడు. ఇంతలో మా అమ్మమ్మ అందుకుంది.

"వాడుమాత్రం వేళకు భోజనానికి జేరుకుంటాడు. ఈ లోపల వాళ్ళింట్లోనుండి

# శుభశ్రీ

కికకికలు పకపకలు వినవస్తుంటవి. ఒకొక్కక్కసారి యింట్లోనేవుండి తలుపు వేసుకుంటారు. అది నా కళ్ళారామూస్తుంటాను"

ఈవిధంగా నూరిపోసేటప్పటికి మా నాన్నకు పట్టరానంతకోపం వచ్చింది. బిగ్గరగా నన్ను పిలిచారు. నేను వెళ్ళాను. అంతా నిశ్శబ్దము. అంతా యేదో తప్పు చేసిన ముద్దాయీలలాగ నిలబడ్డారు.

నిశ్శబ్దమును భేదించుతూ మా నాన్న "నీవు యికనుండి వాళ్ళయింటికి పోవద్దన్నాడు.

"ఎవరింటి" కన్నాను నిర్భయంగా

"మీ అత్తయ్యగారింటి" కన్నాడు.

"ఏం" అన్నాను.

"పోవద్దు. మీ మేనమామలు చెప్పినట్లు విన" మన్నాడు.

"వీళ్ళు చెప్పితే యెంతవినాలో ఆమె చెప్పినే అంతే వినాలిగా" అన్నాను.

దాంతో మా నాన్న కొంతసేపు తన కోపమునంతా అగ్నివర్షములా కురిపించాడు నా మీద.

నెలకు సరిగా డబ్బుపంపేవాడుకాదు మానాన్న. నాకు కావలసిన పాఠ్య గ్రంథములను కొనేవాడు కాదు. డబ్బు యిచ్చేవాడు కాదు. కాలేజీలో స్నేహితులు హోటలుకు తీసుకువెళ్లితే యెప్పుడూ వాళ్లు చెల్లించవలసిందే. నావద్ద చెల్లించటానికి డబ్బు వుండేదికాదు. అందుచేత కాలేజీకి సరిగా వేళకు వెళ్ళేవాడిని. వదలిపెట్టగనే అందరికన్న ముందుగాని వెనుకగాని వచ్చేవాడిని. మంచిగుడ్డలు తొడిగి కాలేజి విద్యార్థినని అనుపించుకోవాలని ప్రయత్నించేవాడను. కాని మానాన్న నాకు రెండుజతలు మాత్రమే కుట్టించాడు. అందులో ఒక జత యిస్త్రీకి వేస్తే, ఒక జత వారం పది రోజులు తొడిగేవాడిని. కాఫీ త్రాగుదామని డబ్బులివ్వమంటే, మూడుపూటలు అన్నం తినమనేవాడు. రెండుపూటలు తింటుంటేనే మా మా మేనమామలు నా మీద పగ సాధించాలని పట్టుబట్టారు. ఈ కరువురోజులలో, అందులో బస్తీలో మూడవపూట పెట్టమంటే వెళ్ళగొట్టుతారేమోనని భయపడేవాడిని. అట్లానే పొట్ట మాడ్చుకుంటూ రెండు

(55-వ పేజీ చూడండి)



# విజ్ఞానవీధులు

### "డాక్టర్"



## 51 భూమి తనచుట్టూ తాను తిరుగుతోందా?

"భూమి పడమరనుంచి తూర్పువైపు తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యునిచుట్టూ తిరుగుతుంది గదా? అలాగయితే ఒక విమానము ఒక ప్రదేశములో పైకెగిరి కొంతసేపుండి క్రిందికి దిగి వచ్చినప్పుడు ఆ వూరుకాక మరోవూరు అక్కడికి వచ్చి వుండాలికదా? మరి భూమి తిరగడమే నిజమైతే అలాగ ఎందుకురాదూ?" అని వరంగల్ నించి వేముల యతిరాజులుగారు అడుగుతున్నారు.

భూమి చుట్టుకొలత దరిదాపు 24000 మైళ్ళు. ఒకరోజులో భూమి ఉపరిభాగము ఇన్నిమైళ్లు తిరిగివస్తుందన్నమాట. అంటే సెకనుకి 1470 అడుగులు! ఒక రాయి పైకి విసిరేమంటే అది నాలుగు సెకనులకు క్రిందపడేటట్లయితే మైలు దూరము దాటిపడాలి! అలాగు ఎందుకు పడదూ?...ఒకరైలు జోరుగా పోతూన్నప్పుడు పెట్టెలోనే ఒకబంతి ఎగరవేశామనుకోండి. నాలుగు సెకనులలో గంటకి 30 మైళ్ళ చొప్పున, 176 అడుగులు దాటింది రైలు. మరి బంతి ఎగరవేసిన చోటనే పడుతుందేమో? రైలు పరిగెత్తడము లేదా? రైలులో బంతిని ఎగరవేసినప్పుడు బంతికి రెండువేగాలున్నాయి. ఒకటి రైలువేగము. ఇది సెకనుకి 44 అడుగులు. సెకనుకి నలభయినాలుగు అడుగుల వేగంతో భూమికి సమాంతరంగా (అంటే నేలబారుగా) పరిగెత్తే బంతి, అదే వేగముతో పరిగెత్తే పెట్టెలో నేలబారుగా జరగలేదు. ఇక పైకి ఎగరవేసిన బంతి పైకే ఎగిరి క్రిందపడుతుంది గాని నేలబారుగా పరిగెత్తదుగా? కనక రైలులో ఎగరవేసిన బంతి ఎగరవేసినచోటునే పడుతుంది. భూమిమీద పైకెగరవేసిన రాయీ అక్కడే పడాలికదా మరి ఈ సూత్రము ప్రకారము?

భూమిమీదనుంచి విమానము ఎగిరిందంటే, దానికీ భూమివేగము వుంది. వరంగల్లో విమానము ఎగిరితే విమానమూ, హనుమకొండా కూడా భూమివేగముతో తూర్పుకి పరిగెత్తుతున్నాయి. అంటే వీటి మధ్య దూరము భూమి భ్రమణమువల్ల తగ్గడానికి వీలే లేదన్నమాట. ఇక ఒకటే మార్గము. భూమికి లేని వేగము విమానానికి స్వంతంగా వుంటే విమానము హనుమకొండకి పోగలదు. ఇది అందరికీ తెలుసు.

అయితే భూమితోపాటు తిరుగుతున్న వస్తువులన్నిటికీ భూమి వేగస్ఫురణ వుండడానికి వీలు లేదు. మరి ఎవరికి వుంటుందీ, భూమ్యాకర్షణకి వెలిగావున్న నక్షత్రాలకి వుంటుంది.

## 52. సిగరెట్ లైటర్లలోని చెకుముకి ఏమిటి?

ఆర్యులు యజ్ఞయాగాదుల్లో అగ్న్యాధానంకోసం అరణులను మథించేవారని వీరు చిన్నతనంలో చదివి వుంటారు. ఆ విధానంలోని కష్టాన్ని ఊహించండి. లేదా అగ్గిపెట్టెలకు ఎద్దడి కలిగిన రోజుల్లో చెకుముకిరాతినీ ఉక్కుముక్కనీ రాపాడి రవ్వలను కల్పించి ప్రత్యేకంగా తయారైన వత్తులను వెలిగించి చుట్టముట్టించుకొన్న పల్లెపట్టుల్లో ఉన్న మీ పరిచితుల్ని అడిగి తెలుసుకోండి. అప్పుడు టక్కున కొట్టగానే రవ్వలు కక్కి వెంటనే వత్తిని వెలిగించే లైటర్లవల్ల ఎంత సౌకర్యం ఏర్పడిందో మనస్సుకెక్కుతుంది. లైటర్లలో చిన్న ఉక్కు చక్రము, దాని అంచుకి ఆనుకొని ప్రక్కవాటుగా ఉన్న, కృత్రిమ చెకుముకితో రాపాడటంవల్ల, అడపాతడపాగా కాకుండా, చిత్తజల్లుగా రవ్వలు వస్తాయి. అందుచేతనే పెట్రోలులోనో స్పిరిట్ లోనో తడిసిన వత్తి వెంటనే భగ్గుమని వెలుగుతుంది. కొద్దిరాపిడివల్ల కలిగే వేడికే నిప్పురవ్వలు గ్రక్కే ఈ కృత్రిమ చెకుముకి ఒక మిశ్రమలోహము. అందులో మెగ్నిషియము, అల్యూమినియము, సీరియము అనే ధాతువులుంటాయి. వీనిలో మొదటి రెండూ చాలామందికి తెలిసినవే. సీరియము అపరూపమృత్తికా ధాతువులవర్గానికి చెందినది. అది తిరువాన్కూరు సముద్రతీరాన్నున్న మోనాజైట్ ఇసుకలో (ఖనిజరూపంగా) ఇతర ధాతువులతో కలసి దొరుకుతుంది. ఆ ఖనిజంలో ఉన్న ఇతర ధాతుపదార్థాలని తీసేసిన తరువాత మిగిలే సీరియముతో మెగ్నిషియము, అల్యూమినియములను కలుపుతారు. తరువాత ఆ మిశ్రమాన్ని హైడ్రోజన్ వాయు ప్రసారంలో వెచ్చ చేస్తారు. అప్పుడా ధాతువులు హైడ్రోజనితో రసాయనికంగా సంయోగించడంచేత హైడ్రైడులు తయారై గుత్తంగా కలిసి మెలిసి ఉంటాయి. తర్వాత ఆ మిశ్రమలోహాన్ని కరగించి సన్నటి కణికలుగా పోతపోస్తారు. అదే ధాతుసాధకులు వైజ్ఞానిక పరిశోధనలవల్ల సాధించిన కృత్రిమ చెకుముకి. (—హరి)

## 53. చెవులు మూసుకున్నప్పుడు "గుంయి" మనే నాదం

"నిశ్శబ్దంగా యున్న రాత్రిలోనూ, పగలు చెవులు మూసుకుంటేనూ ఒక విధమైన ఊగుడు శబ్దం వినబడుతుంది. ఎందువల్ల?" అని రాజమండ్రీనుంచి డి. బుచ్చిబాబుగారు అడుగుతున్నారు.

మన చెవిని లోపలిభాగము మధ్యభాగము బహిర్భాగము అని మూడు భాగాలుగా విభజించవచ్చును. బహిర్భాగానికి మధ్యభాగానికీ నడుమ కర్ణభేరి అనే చర్మముంటుంది. ఈ చర్మానికి వెలుపలివైపున గాలి వున్నదని మనకి తెలుసును. ఇక కర్ణభేరియొక్క లోవైపున బయలుదేరి గొంతుకవరకూ వుండి గొంతుకలోకి తెరుచుకునే 'యూస్టాచియన్' గొట్టమువల్ల కర్ణభేరి లోవైపుకి కూడా గొంతూ ముక్కుల

మలద్వారా వెలుపలి గాలితో సంబంధము యేర్పడుచున్నది. కర్ణభేరికి యిటూ అటూ వున్న గాలుల వత్తిడి సమముగా నున్నప్పుడు కర్ణభేరి కంపించనూ కంపించదూ, మనకు శబ్దాలూ వినిపించవు. చెవి పైభాగమును దూది వత్తి పెట్టిగాని గ్లాసును బోర్లించిగాని మూసి కర్ణభేరికి పైపుగల గాలిని బంధించినపుడు ముక్కు గొంతుకా 'యూస్టాచియన్' గొట్టముద్వారా కర్ణభేరి లోవైపు గాలితో సంబంధము కలిసియున్న వెలుపలి గాలిలోని కంపనములు కర్ణభేరి లోవైపునకు అందును. ఇందువల్ల కర్ణభేరి కంపించి గుంయి మనే శబ్దం వినబడును. గ్లాసును గాని దూదివత్తిని గాని తీసివేయగానే కర్ణభేరి లోవైపునకు అందునట్టి కంపనములే పైవైపునకు కూడా అందుతూండడముచేత రెండూ సమానమైపోయి కర్ణభేరి కంపించనూ కంపించదు మరి ఆ శబ్దాలూ వినబడనూ వినబడవు.

మనము గట్టిగా చీదినప్పుడు గొంతులో ఉన్న శ్లేష్మము 'యూస్టాచియన్' గొట్టాన్ని మూయవచ్చును. ఇలా మూసేటప్పుడు యూస్టాచియన్ గొట్టములోని గాలి నొక్కబడి, కర్ణభేరి లోవైపుని ఒత్తుతుంది. చెవులు గడివేసినట్టుంటాయి. అప్పుడు గాని గుటక వేస్తే, గొట్టాన్ని మూసిన శ్లేష్మము దిగిపోయి, గొట్టాము తెరుచుకుని, ఒత్తిడి తగ్గిపోతుంది. —పాణి.

## 54. చీకటిని విరజిమ్మే యంత్రమా?

"చీకటి అంటే ఏమిటి? ఇంద్ర ధనుస్సులో ఏర్పడు ఏడురంగులలో నలుపు రంగు ఎందుకని లేదు? చీకటివున్న ఒక గదిలోకి వెలుతురు ప్రసరించినపుడు ఆ చీకటి ఏమవుతున్నది? వెలుతురును ఆపు చేసినవెంటనే మళ్ళీ చీకటి ఎలా నిండుకుంటోంది? ఒక యంత్రమును మీట నొక్కినచో చీకటి ప్రసరించగలదా?" అని మైపూరునుంచి ఐ. శ్రీనివాస శర్మగారు అడుగుతున్నారు.

చీకటి అన్నదానికి సత్త అనగా ఉనికి లేదు. వెలుతురుకే ఉనికి కలదు. వెలుతురు లేకపోవడమే చీకటి. లోతైన సముద్ర గర్భములోనికి సూర్యుని వెలుతురు చొరబడలేదు. కనక అక్కడ కటికి చీకటే వుంటుంది. 'చీకటి'అంటే వెల్తురు 'లేకపోడము' అన్నమాట. భూగర్భములోని గనులలోనూ అంతే. రైళ్ళు దూరే సొరంగాలలోకూడా చీకటిగా వుంటుందని మనకి తెలుసు. గదిలోకి వచ్చే వెల్తుర్ని కిటికీలు మూసి నిరోధిస్తే గది వెల్తురు లేక చీకటినిండినట్లు కనబడుతుంది. కళ్లు గట్టిగా మూసుకుంటే చీకటిగా వుంటుంది. నిజానికి చీకటి అన్నదిలేదు. వెల్తురు లేకపోవడమే చీకటి. వస్తువులనుంచి వెల్తురేదీ మన కంటికి అందకపోడమే 'చీకటిగా వుండడము.' 'చీకటి నిండుకుంటుంది' అనడము సరికాదు. 'వెల్తురు నిష్క్రమిస్తుంది' అన్నదే సరి. "పేదరికము వచ్చింది" అనడము వంటిదే "చీకటిపడింది" అనడము. రెండూ నిజము కావు. పేదరికము రాదు; ధనము రావడము తగ్గిపోతుంది. అలాగే 'చీకటి' పడదు. వెల్తురు వెళ్ళిపోతుంది. చీకటియొక్క 'కాంతి' 'కాకోల కాలకంఠ కంఠ కరిఘటా ఖంజరీట ఘనఘనాఘనసంఘాత గాఢ కాంతి కటికిచీకటి రోదసీగహ్వరమున కవిసె" నన్న కవీశ్వరుని రచనవాక్చాతుర్యమే కాని విజ్ఞానదృష్ట్యా నిజము కాదు.

'రంగు' అన్నది వెలుతురుయొక్క గుణము. తెల్లని సూర్యకాంతిని పట్టకము వల్ల విశ్లేషిస్తే ఏడు రంగులుగా విడిపోతుందా కాంతి. నలుపన్నది రంగు కాదు. ఏ రంగూ లేకపోవడమే నలుపంటే. ఇక తెలుపంటే ఏమిటంటారా? అన్ని రంగులూ కలిసివున్నదే తెలుపు. తెల్లని సూర్యకాంతిమబ్బులోని నీటిబిందువుల వల్ల విశ్లేషించబడినప్పుడు ఇంద్ర ధనుస్సులో కనబడే రంగు లేర్పడతాయి. నలుపన్నది రంగే కాదూ, అందువల్ల ఏ రంగుని విశ్లేషించినా నల్లరంగు కిరణాలు రావు. ఫొటోగ్రాఫులు తీసే ప్లేటు, రంగుల కిరణాలు దానిమీద పడినప్పుడే కగ్గి, ఆ యా ద్రావణాలతో కడిగితే బొమ్మని చూపించగలదు. చీకటిలో సంవత్సరకాలము వుంచినా ఆ ప్లేట్లూ ఫిల్ములూ పాడైపోవు.

చీకటికీ నల్లరంగుకీ 'వెల్తురు లేకపోడము,' 'రంగు లేకపోడము,' అన్న ఋణ గుణాలేగాని ధన గుణాలేవీ లేవు.

చీకటిలో కూడా చూడగల జంతువులున్నాయి-పిల్లీ, పులీ వంటివి. వెలుతురు వస్తువులమీద పడి అక్కడినుంచి ఏదో విధాన్ని మన కంటిమీద పడితే ఆ కంటికి ఆ వస్తువు ఆ విధంగా వున్నట్టు తెలుస్తుంది. మనం 'చీకటి' అన్న చీకటిలో కూడా కొంత వెలుతురు వుంటుంది. తమ కంటిపాపలను పూర్తిగా విప్పి, ఆ కొంచెపు వెలుతురి నేనా తమ మెఱుగు 'రెటీనా'లవల్ల చూడగలుగుతాయి రాత్రించరాలు. అంతేగాని కటికిచీకటి వుండే గదుల్లో పిల్లులుకూడా ఏమీ చూడలేవు.

చీకటికి వస్తుతః సత్త లేదు. కనక చీకటి యంత్రం అంటూ ఏదీ వుండబోదు. ★

# బొమ్మరిల్లు

## గంగులు - దయ్యము ★ "పట్నాయక్ మావాయ్!"

రంగవరము అను గ్రామములో
గంగులు అను కాపున్నాడూ
హంగూ ఆస్తీ లేకపోయినా
పొంగుచు రంగుగ నుంటాడూ

చిట్టడవికి ప్రొద్దునపోయీ
కట్టెలు కొట్టుక వస్తాడూ
పట్టణములో వాటిని అమ్మీ
పొట్టకు డబ్బులు తెస్తాడూ

ఒకనాడాతని కలలో దేవుడు
ఒప్పుగ కనబడి అన్నాడూ
"నీకొక దయ్యము రేపటి రోజున
నౌకరుగానూ వస్తాడూ.

చతురత వానిని సాధించితివా
సకల సంపదలు పొందెదవూ
కానిచో వాడే నిన్ను చంపునూ
కావున నుండుము జాగ్రతతో!"

రెండవ రోజున గంగులు అడవిలో
ఎండు కట్టెలూ కొట్టగనూ
దండము పెట్టుచు దయ్యము ఒకడూ
నిండు భక్తి నిటులన్నాడూ.

"నేటి నుండి నీదాసుడ నైతీ
నేర్పుతో పనులను చేకొనుమూ
నిముషము నిలిపితివ పని నీయక
నిన్ను చంపెదను నిక్కముగా!"

ఆమాటలు విని గంగులు అప్పుడె
ఆజ్ఞాపించెను దయ్యముకూ
"రాజ భోగములుగల సంపదలూ
రయమునకూర్పుము రభసముతో"

"చిత్తము!" అని దయ్యము పోయెను
సిరి సంపదలు కూర్చగనూ
రంగవరములో గంగులు యిల్లొక
రాజభవనమై రంజిలెనూ!

"రంభను పోలిన పిల్లను తెమ్మ"న
రయమున కూర్చెను దయ్యంబూ
గంగులు పెండ్లాడెను పిల్లను
పొంగుచు అతి విభవముతో!

ఎన్ని కోరికలు గల వీభువిలో
అన్నిటి నిచ్చెను గంగులుకూ
దయ్యముకొక నిముషంబైనా
నియ్యగ లేదూ విశ్రాంతీ!

'ఎంత కాలమిటు నడచునోకో' యను
చింత కలిగెనూ గంగులుకూ
అంతలోన నొక చక్కని త్రోవా
స్వాంతములో తోచెనహా!

అప్పుడు గంగులు హర్షముతోడుత
చప్పున పిలిచీ దయ్యముకూ
కప్పలు నిండిన చెఱువును జూపీ
చెప్పెను మిక్కిలి శాంతముతో!

"ఇందులో గల కప్పల నెల్లా
పొందుగ బట్టీ నాకిమ్మా
తీరము నుండియె బట్టుము వానిని
నీరములో జొరబడకుండా!"

మూర్ఖపు దయ్యము మోసము
తెలియక
మోదముతోడుత పోయినదీ
తీరముపైనీ కూర్చొని యెంతో
తీరుగ చెఱువును చూచినదీ!

ఒక్కొకకప్పా ఒడ్డుకు రాగనె
గ్రక్కున చేతులు చాపుచునూ
పట్టుటకై కడుయత్నము చేయుచు
గట్టి దీక్షనూ పూనినదీ!

ఒప్పుగ గంటల తరబడి యుండగ
ఒక్క కప్పనే పట్టినదీ
అంతలో రెండవ కప్పను బట్టగ
చెంతను గల కప్పను వదిలినదీ!

ఇట్టుల గడచెను ఎన్నో దినములు
పట్ట లేదు ఒక కప్పయినా
చిట్టచివర కాదయ్యము విసిగీ
చిట్టడవికి పారినదీ!

గంగులు దయ్యపు పోకడ జూచీ
చెంగున గంతులు వేశాడూ
హంగూ ఆస్తీ ఆలూతోడుత
పొంగుచు రంగుగ నున్నాడూ! ★





# రామూ కథ



[ఒక్కమాట! ఈ కథ చదివేవాళ్ళందరూ రామూమాట జ్ఞాపకం ఉంచుకోవాలని ప్రార్థిస్తున్నాను. రాము నిష్కళంకమైన మాతృప్రేమ గలవాడు. అంత చిన్నవయస్సులోనే కష్టసుఖాలు గుర్తించాడు. తాను కష్టపడుతూ కూడా, తన తల్లిహృదయం బాధపడుతుంటే చూడలేదు. అందరమూ రామూవలె ఉండాలి. అదే నాకోరిక ఇక చదవండి-]

"రామూ!"..."స్కూల్ టైం అయిందిరా: బెల్ కొడుతున్నారు. వస్తావా ?"

"ఓ...రామూ"...! "స్కూలుకు వస్తావా!"

"రామూ !"...అంటూ బయటి నుంచి ఎవరోపిల్లలు పిలిచారు.

"ఆ! ఆ! వస్తున్నా...అమ్మా! బడికి వెళ్తున్నానే. బడిపిల్లలు పిలుస్తున్నారు. అదుగో! బెల్ కూడా కొడుతున్నారు. మరి వెళ్లి రానా?"

"వెళ్లు బాబూ.....వెళ్లు.... ఆ! అన్నట్లు...రామూ! రామూ..."

"ఎందుకమ్మా!"

"ఇలారా బాబూ. రామయ్య కొట్లోకివెళ్లి అర్ధశేరు బియ్యం తెచ్చిపెట్టునాన్నా!"

"తెస్తానమ్మా! ఏదీ, సంచి... డబ్బులు ?"

సంచి పట్టుకువెళ్ళిన రాము ఖాళీ సంచితో తిరిగివచ్చాడు,

"అమ్మా! ఇంకో కానీ కావాలట. శేరు కచ్చితంగా 0-7-7, అర్థశేరు నాల్గణాలట. కొంటే శేరు, 4 శేర్లు, 10 శేర్లుకొనాలే కాని, అర్థశేరు బియ్యం యిమ్మని బతిమలాడగా బతిమలాడగా వినుక్కుంటూ, గొణుక్కుంటూ "తే! పావలా" అన్నాడు. మూడణాల ముక్కానీ ఉన్నదనేసరికి ఎంత ఎగిరిపడ్డా డనుకున్నావ్! తిడుతున్నాడు. దరిద్రపు గొట్టువెధవలట."...

"పోనీలే బాబు నిజంగా మనం దరిద్రులమే నాయనా! అతడు వున్నమాటే అన్నాడు; కోపం




ఎందుకులే బాబూ!...కానీ లేదు: ఎలా ?"

"ఆ...అమ్మా! మొన్న వినాయకచవితికి నీవు కానీ యిచ్చావు చూడు; అది, కొయ్యపెట్టెలో పెట్టేనే. చూస్తాను వుండు"...

"ఇదిగో దొరికింది. ఒక్క నిముషంలో తెస్తా బియ్యం" అని పరిగెత్తాడు రామూ వీధిలోకి.

'నాయనా! రామూ! ఎంత మంచివాడవోయ్. దరిద్రులమైన మాకడుపున పుట్టావ్. కడుపునిండా కూడు కూడా పెట్టలేక పోతున్నాము కదా! ఆకలేస్తున్నా అన్నం అడగవు. చినిగిన బట్టలతోనే బడికిపోతావు. పట్టుమని పదేళ్ళునిండ లేదే—ఎంత బుద్ధిమంతుడవయ్యావు! నాకన్న తండ్రీ! నీమూలాన, నా కష్టాలన్నీ మరచిపోతున్నాను బాబు...మా బాబు లక్షాధికారింటిలో పుడితే...యిలా వుండేవాడా! నా తండ్రి. కటికి నేల మీద, కాలే కడుపుతో......'అయ్యో!...'అంటూ లోలోపలే కుమిలిపోయింది ఆ కన్న తల్లి కడుపు.

'అమ్మా!....అమ్మా!...ఇవిగోనే బియ్యం. పావుగంట సేపు నించోపెట్టాడు. బడికి ఆలస్యం అయిపోయిందే అమ్మా! పోనా!......అదేమిటే అమ్మా! కళ్ళెఱ్ఱగా ఉన్నాయ్! ఏడుస్తున్నావెందుకూ? నాన్న వచ్చి కొట్టాడా నిన్ను ?"...

"లేదునాన్నా వెళ్ళు! బడికి వెళ్ళు"

"మరి నీవు అలావుంటే నేను పోనే పోను"

"లేదు బాబూ లేదు! వెళ్ళు... జాగ్రత్తగా వెళ్లు!...ఎవరి జోలికీ పోకేం?...బడి వదిలేస్తే త్వరగా వచ్చెయ్"!

ఆమె రామూ పోయిన త్రోవ వెంటే శూన్యంగా యింకా అలా చూస్తూనేఉంది.

దేశంలో పేదవాళ్లు ఎందరో! అటువంటివాళ్లల్లో రామూవాళ్ళ కుటుంబం ఒకటి. రామూ నాన్న పచ్చి జూదగాడు. చాలా దుర్మార్గుడు. తాగి తందనాలాడి భార్యను చావగొడుతుంటాడు. ఆమెని

# రామూ కథ

కొట్టని రోజంటూ ఉండదు. ఆయన మాటకు ఎదురుచెప్పలేని యిల్లాలు ఆమె. ఇంటిగుట్టు బయటకు పొక్కకుండా సంసారం చేస్తూ కడివెడు దుఃఖాన్నీ కడుపులోపెట్టుకు కాలం గడుపుకువస్తోంది — ఆ శలన్నీ రామూమీదనే పెట్టుకొని.

రామూ స్కూలులోకి వచ్చాడు. అప్పటికే తెలుగుమాష్టారు "శ్రీరాముని దయచేతను నాయూఢిగ సకల జనులు"...అని మొదలెట్టి రాగం తీస్తున్నారు. రామూ తలుపుదగ్గరగా నిలబడిపోయాడు, మాష్టారి ఆజ్ఞకోస. .కానీ ఆయన చూస్తేనా, లోపలకు రమ్మనడానికి!

"ఔరాయనగా...ఆ...ఆ...... నోరూరగ చవులుపుట్ట...నుడివెద సుమతీ... యీ..యీ." మాష్టారు ఉత్సాహంగా తలకాయి గిరగిరా తిప్పటం మొదలుపెట్టారు. ఆ తల తిరుగుడులోనే రామూ కనిపించాడు అయ్యవారికి.

"సుమతి!...యి...యి..ఔరా.. దుర్మతీ! ఎప్పుడొచ్చావురా!... దొరగారు ఇప్పుడే వస్తున్నట్లుంది. ఏం?..ఆ...దయచేయండి! ఊ... రా...యిటురారా... వెధవాయ్." చత్వారం జోడుతీసి బల్లమీద పెట్టి ఏదో వెతుకుతున్నాడు. పాపం రామూ బిక్కమొఖం వేశాడు.

"ఏరా! మా నేటర్! కేన్ యేదీ?"

"అదుగో నండి. మీ వెనకాల."

చత్వారమున్న మాష్టారు కళ్ళజోడు పెట్టుకోడం మరచి పోతూ ఘుంటారు! బెత్తం, వెదుకటానికి కుర్చీలోనుండి లేవబోయే సరికి, పంచెకట్టు కుర్చీ కఱ్ఱకు తగులుకొంది. క్రింద ఉన్న బెత్తం తీద్దామని, పంచె కుర్చీకి తగులుకున్నా లెక్కబెట్టక, ముందుకు వంగి బెత్తం తీయబోయారు. ఇంకేముంది! కుర్చీ సరిగ్గా వచ్చి మాష్టరి గుండెమీద ఠఫీమని పడింది. "అబ్బా!" అని గుండె సర్దుకుంటుంటే పిల్లలంతా ఒక్కసారి ఘొల్లుమన్నారు. ఇహ చూసుకోండి మాష్టారు శివతాండవం!

"ఎవడురా నవ్వింది; హు!... చెప్పరేం?..."

"నువ్వేనా రామూ! నువ్వే, గాడిదా! బడికి ఆలశ్యంగావచ్చింది కాక, నవ్వుతావురా. ఉ...ఆ... నవ్వుతావ్రా...ఏం?...ఏది యిప్పుడు నవ్వు...నవ్వవేంరా; రాస్కెల్."

"బాబోయ్! దణ్ణమండి, మాష్టారూ! నేను నవ్వలేదండి.. అమ్మో! బాబో... నేను నవ్వలేదండి...."

"వెధవా! పైగా అబద్ధాలాడతావ్! హు!...నిజం చెప్పు. నవ్వలేదూ?.....నవ్వానను.

అనవేం...ఊ!...ఒప్పుకో. ఒప్పుకోకపోతే చంపేస్తాను. మాట్లాడవేం?....వె.......ధ....వా....నవ్వా..."

"అమ్మో! మాస్టారూ! కొట్టకండి. నేను నవ్వలేదండి..."

"నువ్వు మొండి వెధవ్వి రా. లేగాడిదా! లే...బెంచి ఎక్కు. నిన్ను కొట్టి కొట్టి, నాచేయి నెప్పి పుట్టిందిరా! వెధవా! నిం-చో! ఊఁ!." వగర్చుకొంటూ, పంచె సర్దుకొని కుర్చీలో కూలబడ్డారు మాస్టారు.

రామూ ఏడుస్తూ బెంచిమీద నిలబడ్డాడు. ఒళ్లు హూనమైపోయింది. అక్కడక్కడ రక్తం చిమ్ముతోంది. కాళ్లు వణికిపోతున్నయ్.

"అమ్మా!..."

క్లాసంతా నిశ్శబ్దంగా వుంది. ప్రతి కుర్రాడూ రామూ వైపు జాలిగా చూస్తున్నాడు. చిన్నపిల్లలకున్న దయాదాక్షిణ్యాలు, బుద్ధులు చెప్పే మాష్టారుకి లేకపోయాయ్!

"పొండి వెధవల్లారా...పొండి!" గుండె లాగిపోయినంత పనిఅయింది పిల్లలకు. సింహగర్జన కూడ అంత భయంకరంగా ఉండదేమో!!!

"చూస్తారేం గుడ్లగూబల్లా. మీకు చదువూ రాదు; సంధ్యా రాదు పొండి. ఊ!" పిల్లలంతా నిశ్శబ్దంగా ఒక్కొక్కరే బయటకు జారుకున్నారు.

"ఏరా గాడిదా! ఇంకా నిలబడ్డావే దున్నపోతులాగా! ఫో!" అని మళ్ళీ బెత్తం పుచ్చుకున్నాడు మాష్టరు. రామూ బల్ల దిగి నెమ్మదిగా, పుస్తకాలు పట్టుకొని బయటకు వచ్చాడు.

అక్కడ కాచుక్కూర్చున్న పిల్లలంతా ఎంతో జాలిగా రామూ మీద సానుభూతి చూపించారు.

"అసలు రామూ నవ్వలేదురా! పాపం వాడ్ని అన్యాయంగా కొట్టామేస్టారు."

"వాడి గుండు చితికితే చచ్చేవాడురా."

అందులో ఎనిమిదేళ్ల కుర్రాడొకడు ముందుకు వచ్చి "కొట్టమంటే మాత్రం మహాయిదిగా వస్తాడు. పాఠం చెప్పమంటే చాతకాదు" అని తన కోపాన్ని వెళ్ళగ్రక్కాడు.

"ఒరేయ్ వెనగ్గా వెళ్లి ఆ పిలక పుచ్చుకొని లాగాలిరా. దాంతో వదులుతుంది వాడి తిక్క." అన్నాడు అల్లరి తెలిసిన పిల్లాడొకడు.

కాని రామూకి యివన్ని వినిపించటం లేదు. పిచ్చివాడిలా నడుస్తున్నాడు. స్నేహితులంతా ఎవరిళ్లకు వాళ్లు వెళ్ళిపోయారు.

ఇంటిదగ్గిరకు వచ్చానన్న విషయం జ్ఞాపకంరాగా, కళ్లు తుడుచుకొని ఏమీ జరగనట్టు ఇంట్లోకి వచ్చాడు.

అడుగు పెట్టాడో లేదో "అమ్మా! అమ్మా!" అంటూ పెద్దగా ఏడుస్తూ పరిగెత్తాడు. వాళ్లనాన్న వాళ్ల అమ్మను జుట్టు పుచ్చుకొని చెన్నాకోల్ తో కొడుతున్నాడు.

"అమ్మా!.. అమ్మా!... నాన్నా... వద్దునాన్నా...నాన్నా... వద్దు..కొట్టకునాన్నా; అమ్మను. కొట్టకు..అమ్మా!..."

"పోరా వెధవా! పో" అంటూ వాళ్లనాన్న భుజం పట్టుకొని విసరి పారేశాడు రామూని.

"అమ్మా!" అని పెద్దకేక వినబడింది.

"చచ్చిపోయాడు మా నాయన!" అంటూ అమాంతం కౌగలించుకుంది రామూని వాళ్ల అమ్మ. రక్తప్రవాహము! విసిరివేసినప్పుడు మూలనున్న రుబ్బురోటికి రామూ తల తగిలి, పగిలింది.

## ★ రామూ కథ ★

అసలే వళ్లంతా దెబ్బలతో మతిపోయివున్న రామూ, అమ్మను నాన్న దుర్మార్గంగా కొడుతుంటే తన దెబ్బలన్నీ మరచిపోయాడు. ఆవేశంతో వాళ్ల నాన్నకు అడ్డుపడ్డాడు. తాగిన మత్తులోవున్న వాళ్ల నాన్న, వళ్లుతెలియక రామూను విసిరికొట్టాడు. మూలనున్న బండతాతికి తగిలి తలకాయ పగిలి రక్తం కాలువలు కట్టింది. ఆ మాతృహృదయం పగిలిపోయింది.

తలకు కట్టుకట్టి మంచంమీద పడుకోబెట్టింది తల్లి. తండ్రికి అప్పటికీ యింకా తాగినమత్తు పోలేదు. కాని ఏదో తప్పు చేసినట్లు, ఏదో పోగొట్టుకున్నట్లు మంచం దగ్గర ఏడవడం మొదలెట్టాడు. ఇరుగుపొరుగువాళ్లు పోగయ్యారు. రామూ యీ ఊహలో లేడు. వళ్లంతా సలసలా కాలిపోతూంది. మధ్య మధ్య కలవరిస్తున్నాడు. "మాష్టారూ కొట్టకండి నేను నవ్వలేదండీ! మాష్టారూ! అమ్మో."

....................

"నాన్నా! అమ్మని కొట్టవద్దు నాన్నా"

మంచంమీద ఉండలేక పోతున్నాడు. తల్లి అతని కాళ్లమీద పడి ఏడుస్తూంది. వాళ్ల నాన్న తను చేసిన పని గ్రహించి దిగాలుగా ఒక మూలకు పోయి కూర్చుని విచారిస్తున్నాడు. ఇంతలో ఎవరో డాక్టర్ని తీసుకువచ్చారు.

పాపం డాక్టరు, కట్టుకట్టి లోపలికి ఏదో మందు యిచ్చాడు.

"అమ్మా!" అంటూ అదిరిపడ్డాడు రామూ! "నాన్నా! అమ్మని కొట్టకు నాన్నా...నాన్నా!" ఆ దృశ్యం చూస్తున్నవారికి హృదయాలు తరుక్కుపోయాయి.

రాత్రి 8 గంట లయిపోయింది. కటికిచీకటిలో ప్రకృతి హోరుమంటున్నది. తండ్రి, తల్లి మంచానికి యిరుప్రక్కలా కూర్చొని ఏడుస్తున్నారు. దీపం మిణుకు మిణుకుమంటూంది. రామూ కలవరింపులు ఎక్కువయ్యాయ్. "ఏం ఫరవాలేద"ని డాక్టరు అప్పుడే చెప్పి వెళ్లాడు.

"అమ్మా... యింకో కాసీ కావాలటే... నేరు ఏడణా...ల... ఏడు... పైసలట..."

"అమ్మా ఎందుకే ఏడుస్తున్నావ్!...మాష్టారూ కొట్టకండి.. నాన్నా..." పిచ్చిధోరణిలో ఏవేవో అనేస్తున్నాడు రామూ. గాలివాన వస్తున్నట్లుంది. గాలి విసురుకు తలుపులన్నీ కొట్టుకొంటున్నాయి. దీపం రెపరెపలాడుతున్నది. తాటాకులు గలగల్లాడుతున్నాయ్.

"అమ్మా!" అని కేకేశాడు రామూ. అమ్మ హృదయం ఉవ్వెత్తున లేచింది. "బాబూ! బాబూ పలకవా! బాబూ... బాబూ... నాయనా....."

రామూ యిక లేడు. వెళ్ళిపోయాడు. ★



# జంతుకోటిలో మానవలక్షణాలు



జంతువుల తెలివి తేటలను కని పెట్టేందుకు సాధారణంగా శాస్త్రజ్ఞులు ప్రయోగించే రెండో సాధనం సమస్యలతో కూడిన పెట్టె. (మొదటి చిక్కుదారులు) సమస్యల పెట్టె అంటే మరేమీ కాదు. ఆ పెట్టెలో కానీ, పెట్టెబయటకానీ జంతువును పెట్టి, జంతువు పెట్టె లోపల వుంటే అది తినే ఆహారం బయటను పెట్టుతారు. జంతువు పెట్టెకు బయటవుంటే ఆహారాన్ని పెట్టెలో పెట్టుతారు. పెట్టె మామూలుగా చెక్కలతోనూ రేకు తోనూ చేసిన పెట్టెకాదు. సన్నని జల్లెడ లాంటి తీగెతో చేసిన పెట్టె. పెట్టెలో ఏమున్నదీ బయట వుండే జంతువుకు బాగా కనిపిస్తూ వుంటుంది. కంటి ఎదురుగా కావలసినంత తిండిఅయితే కనిపిస్తుంటుంది కానీ, దాన్ని వెంటనే కరచిపట్టకొనేందుకు వీలు లేకుండా యీ పెట్టె తలుపులు మూసివుంటాయి. ఈ తలుపులు తెరవాలంటే ఒక తాడు కొనపట్టుకు లాగడమో, లేకపోతే ఒక మీట నొక్కటమో, లేకపోతే అక్కడ అంటించివున్న కాగితం ముక్కను గట్టిగా పట్టుకు చించి వెయ్యటమో ఏదో ఒక పని చెయ్యాలి. ఇలాంటి పని మనకైతే చాలా చిన్నదిగా కనిపిస్తుంది కానీ, జంతువులకి బుర్ర బద్దలు కొట్టుకొంటే కాని కుదరదు.

ఇలాటి పరిశోధనలు కొన్ని చేసి చూశారు. చూస్తే ముళ్ళపందులు, పావురాళ్లు, వుడతలు, కాకులు, పందులు యిలాటి జంతువులన్నీ మొత్తంమీద కొంత శ్రమపడి సాధించినట్లు తేలింది. నల్లులు, కప్ప పిల్లలు, పాములు యిలాటి వాటికి- అసలు ఈ సమస్య ఎంతకీ కొరుకుడు పడనేలేదట.

ఈ పెట్టెతో పరిశోధనలైతే చేశారు కానీ, యిలాటి సమస్యలను విడదీసుకోవడంలో జంతువుల తెలివితేటలు ఎంతవరకు బయట పడుతాయి అనే విషయంమీద శాస్త్రజ్ఞులకు ఏకీభావం కుదరలేదు. ఎందుచేతనంటే - ఏ జంతువైనా యిలాటి పెట్టె తలుపులు తెరవటం ఎలాగో మొట్టమొదటిసారి తెలుసుకోవడమనేది అదేదో అప్రయత్నంగా జరిగిందేకాని, ఆ జంతువు తన తెలివితేటలు వుపయోగించి సాధించిన విషయం కానే కాదు. మొదటిసారి అప్రయత్నంగా సాధించిన యీ విషయాన్ని యీ జంతువులు తరువాత గమనంలో పెట్టుకోగలగవచ్చు. అది వేరే విషయం.

ఈ మాదిరి పరీక్షలో, కాస్త చురుకు ఎక్కువగావుండే పిల్లిలాంటి జంతువు తేలిగ్గా నెగ్గిపోతుంది. మందకొడిగా వుండే యితర జంతువులకు యిది తలకుమించిన వ్యవహారం అవుతుంది.

ఇటువంటి లోపాలు కొన్ని వున్నాయి కనుక యీ పద్ధతిని వదిలేసి 'జెన్‌కిన్స్ బాక్స్' అనే మరొక పద్ధతిని ప్రవేశపెట్టారు శాస్త్రజ్ఞులు. ఇదికూడా ఒక పెట్టే. ఇందులోనూ ఆహారం పెట్టుతారు. పెట్టెమూత తెరవాలంటే గొళ్ళేలు, దారులు యీమాదిరి పేచీ ఏమీ లేకుండా, ఏ జంతువైనా ఫలానిరంగు చక్రం మీద కాలు పెట్టితే పెట్టె తెరుచుకొనే ఏర్పాటు వుంటుంది యీ 'జెన్‌కిన్స్ బాక్స్'లో. ఒకే ఒక రంగుబిళ్ళ నొక్కు-దానిని నొక్కి-

# ★ జంతుకోటిలో మానవలక్షణాలు ★

సంకేతమాత్రంచేత పెట్టె తెరుచుకోవటం చాలా సులభమైన విషయమని తోస్తే, రెండో మూడో, పదో, పదిహేనో ఒకేమాదిరి రంగు బిళ్ళలు నొక్కితేనేకాని పెట్టె తెరుచుకోకుండా ఏర్పాటు చేయవచ్చు. ఒక సందర్భంలో కొన్ని రంగుల బిళ్లలు అమర్చి, వాటిలో ఏదో ఫలాని రంగుబిళ్ళల మీదుగా ఏ జంతువైనా మూడుసార్లు వెనక్కీ ముందుకీ నడిస్తే కాని పెట్టె తెరుచుకోకుండా కట్టుదిట్టం చేశారట. అలా చేసి కొన్ని జంతువులను తెచ్చి పరీక్షకు పెట్టితే, గినియా పందికి మాత్రం ఎంతకీ యీ సూత్రం తోచనేలేదట. పిల్లి పిల్ల మాత్రం యిలాటివి మూడు కాదు, ఏడు రంగుబిళ్ళలమీద నాట్యం చెయ్యమన్నా, యిట్టే చేసేసి, అట్టే పోయి ఆ జున్నుముక్కను కొట్టేసిందట. ఇలాటివి ఏడుకాదు, ఇరవై రెండు బిళ్ళలు పెట్టినాకూడా దిగ్విజయంగా పరీక్ష ప్యాసైన జంతువు కోతి ఒక్కటే!

మరొక రకమైన పెట్టెలో వరసగా కొన్ని తాళాలు ఏర్పాటుచేసి, మొదటి తాళం తెరిస్తేనే కాని రెండో తాళం తెరవటానికి వీల్లేకుండానూ, రెండో తాళం తెరిస్తేనే కాని మూడో తాళం తెరవటానికి వీల్లేకుండానూ ఏర్పాటు చేశారట. కానీ - యిది నిజంగా జంతువుల మేధస్సుకు మించిన విషయం. మిగిలిన ఏ జంతువూ వీటిని సాధించలేక పోయాయట కానీ ఒక్క కోతి మాత్రం వరుసగా ఐదు తాళాల వరకు తెరవగలిగిందట. అంతే కాదు - ఒకసారి ఒక తాళం తెరవటం జరిగాక, రెండో తాళం కంటపడినవెంటనే అటూ యిటూ తారట్లాడి కాలాన్ని వృథా చేయకుండా, సరాసరి తాళం పని పట్టటానికే పూనుకొన్నదట, యీ కోతి!

జంతువుల మేధస్సును పరీక్షించేందుకు శాస్త్రజ్ఞులు విరివిగా వుపయోగించే మూడవ సాధనం ఒకటి వుంది. ఇది మిగిలిన రెండు పద్ధతుల కంటే చాలా తెలివైనదీ, తేలికైనదీను. మరేమీ లేదు. ఏ జంతువు తెలివితేటలనైతే పరీక్షించదలిచామో దానికి అందుబాటులోనే అది కోరుకొనే తిండిని పెట్టి వుంచటం; ఆ తిండి వున్న చోటికి యిది వెంటనే పోవటానికి వీలు లేకుండా మధ్యలో యినుపజల్లెడో

(54-వ పేజీ చూడండి)



ఎలుగుబంటిమీద అబ్బాయి

# పందెం కోసం

మా కొట్టు తెరిచి ఇంకా అరగంటైనా కాలేదు, అప్పుడే పేపరువచ్చేసింది. ముఖ్యమైన వార్తలు చూస్తున్నాను. ఇంతలో విశ్వం వచ్చి చేరాడు. వాడికో పేజి ఇవ్వవలసివచ్చింది. మేమిద్దరమూ పేపరు చూస్తుండగా, ఓ కుఱ్ఱాడు పరుగెత్తుకుంటూవచ్చి, వచ్చీరావడంతోటే ... "ముక్కు విరిగే పెన్సిళ్ళున్నాయా?" అని అడిగాడు.

మాకు పరిస్థితి ఏమీ అర్థం కాలేదు. "ఏమిటి కావాలన్నావు?" అని నెమ్మళంగా అడిగాను.

"ముక్కు విరిగే పెన్సులు..." అని టక్కున జవాబు చెప్పాడు.

నేనూ, విశ్వం, ఒకరిముఖం ఒకరు చూచుకున్నాము. ఈవేళ ఇలాటి బోణీవచ్చిందేమిరా భగవంతుడా అనుకొని "అంటే?..." అనడిగాను.

"అంటే ఏముందీ?...ముక్కులు విరిగేపెన్సిలు కావాలన్నాను ... అలాటి పెన్సిళ్లు వున్నాయా? లేవా?"

"ఎందుకు?" అని ప్రశ్నార్థకంగా అతని ముఖంలోకి చూచాను.

"మీ కెందుకదంతా?... వున్నయా, లేవా? తేల్చి చెప్పండి? నేను వెళ్లిపోవాలి" ఇందాకటి నుండి నోరు తెరుచుకు చూస్తున్న విశ్వం అడ్డంవచ్చి "అదికాదు నాయనా...ముక్కు విరిగే పెన్సిలు దేనికి...మంచి పెన్సిలు తీసుకెళ్ళరాదూ?..." అన్నాడు.

"అదంతా నాయిష్టం...ముందు వుందో లేదో చెప్పండి...మీ సలహా నా కనవసరం" అని తీక్షణంగా జవాబిచ్చాడు.

"కొద్దిగా శాంతించవయ్యా... నిన్ననే కొత్తరకం పెన్సిళ్లు




వచ్చాయి ... మంచిరకం ... ఖరీదు జేడా! ... వ్రాసుకోటానికి చాలా బాగుంటాయి .... నిన్న ఒక్క రోజులో రెండుడజన్లు అమ్మేశాను...ముక్కులు విరగటంలాటి పేచీలేవైనా వస్తే వాపస్ చేయి... డబ్బుయిచ్చేస్తాను" అని గొప్పగా చెప్పాను.

"సెనగపప్పున్నయా అంటే మంచి కందిపప్పు నిన్ననే వచ్చిందన్నాడుట నీలాటివాడు...ఇంతకూ అవి లేవన్నమాట..." అని హేళనగా మాట్లాడాడు ఆ కుఱ్ఱాడు. దాంతో మాకు కొద్దిగా కోపం వచ్చింది.

"ఇతనికి పిచ్చెత్తింది..." అన్నాడు విశ్వం.

"నాక్కాదు...నీకే ఎక్కింది పిచ్చి" అని విసురుగా వెళ్ళబోయాడు.

"ఇదిగో...ఆగవయ్యా... తొందరపడతా వెందుకు...ఆరకం కూడా వున్నాయి...వాటిలో ఫస్టు అయినవీవున్నాయి... ఖరీదు ఎనిమిదణాలుమాత్రమే...ముక్కులు విరగకపోతే నాదగ్గరకు తీసుకురా..." అని ధీమాగా అణాకానీరకం పెన్సులు చూపెట్టాను.

"ఆ రకంవే ఇవ్వండి...ముక్కు విరగకపోతేమాత్రం తెస్తాను... డబ్బులిచ్చేయాలి" అని నిస్సంకోచంగా రూపాయ నోటు తీసి యిచ్చాడు.

పెన్సులుతోపాటు అర్ధరూపాయి ఇచ్చాను. పోతూవున్నవాడిని ఆపి... "ఇంతకూ అలాటి పెన్సిల్ ఎందుకో చెప్పావుకావు..." అన్నాడు విశ్వం.

"నేను చెప్పను...చెప్పకూడదు... వీల్లేదని ఒక్కసారి చెప్పితే చాలదూ?" అని విసురుగా వెళ్ళిపోయాడు. పోతున్నవాడికేసి చూస్తూ "ఎందుకో?" అన్నాడు విశ్వం.

"ఎందుకైతే నీకేం రా...? తొమ్మిది దమ్మిడీల పెన్సులు ఎనిమిదణాలకమ్మేను. భలేబోణీలే..." అన్నాను సంతోషంగా.

"ఇంట్లోవాళ్ల కేదో టోపీపెట్టేందుకులావుంది" అన్నాడు విశ్వం-

# పందెంకోసం

ఏదో గొప్పరహస్యం కనిపెట్టిన వాడిలా—

"నీ వెందుకురా బుఱ్ఱపాడుచేసుకుంటావ్?... అందుకే నీ తల బట్టతలఅయింది. ఇక ఆ సంగతి మర్చిపో.." అన్నాను. అన్నానే కాని మాకిద్దరికి, ఆరోజంతా ఆవిషయంగురించిన ఆలోచనలే! ఆ కుఱ్ఱాడి ధర్మాన ఆరోజు అమ్మకంఅంతా ఆవిధంగా నేవుంది. అమ్ముడుబోయినవన్నీ ఓటివే! రేటుమాత్రం బాగాగిట్టింది. రోజూ ప్రొద్దునే ఇలా ఎవ్వడన్నావస్తే బాగుండును అనుకున్నా—



* * *

మరునటిరోజు సాయంత్రం సినిమాకు వెళ్లుదామని విశ్వంఇంటికి బయలుదేరాను. నిన్నజరిగిన విషయంగుర్తుకొచ్చి నవ్వుపుట్టుకొస్తున్నది... "కొట్టుకు శలవుగాని లేకపోతే, ఇవ్వాళ్ళ ఏం వింతజరిగేదో!" అనుకున్నా. ఇంతకూ అతను ఆ పెన్సిలుతో ఏంచేస్తాడా అని ఆలోచించుకొంటూ విశ్వం ఇంటికెళ్ళి వరండాలో కూలబడ్డాను.

"ఏమిటిరా ఆలోచిస్తున్నావ్?" విశ్వం అడిగాడు. "నిన్ననన్నంటివే ఇవ్వాళ నీవేం చేశావు? బుద్ధిచెప్పి గడ్డితిన్నావులే...బట్టతల లేదు కాని..." అని ఏదో వాగుతున్నాడు. నాదృష్టిమాత్రం ఎదురుగా రోడ్డుమీద వస్తున్న కుఱ్ఱాళ్ళ గుంపుపై పడింది.

"అదుగోరా! ...నిన్నటికుఱ్ఱాడు వస్తున్నాడు" అని ముందువరుసలో వస్తున్న ఎఱ్ఱచొక్కా కుఱ్ఱాడిని చూపెట్టాను.

"ఆఁ!" అంటూ ఆత్రంగా చూచాడు విశ్వం.

ఇంతలోనే కుఱ్ఱవాళ్ళు రావడం, దసరాపండుగకు బడి పిల్లలు వచ్చినప్పుడు నిండినట్లు విశ్వంగాడి వరండా నిండిపోవటం-అంతా ఇట్టే జరిగిపోయింది. వాళ్ళంతా కూర్చున్నారు. వాళ్ళలో వాళ్ళు ఏదో వాదించుకుంటున్నారు. ఆవాదనలేమిటో విందామంటే ఏమైనా వినబడితేనా—ఒకళ్ళా ఇద్దరా- అందరూ ఒకేసారి మాట్లాడేస్తున్నారు. ఎఱ్ఱచొక్కా-అబ్బాయి (అంటే- మాకొట్లో పెన్సిలు కొన్న అబ్బాయి) నా దగ్గరకు వచ్చి అంటించివున్న కవరు ఒకటి నాచేతి కిచ్చాడు. అంతటితో వరండా అంతా నిశ్శబ్దమైపోయింది. చీమ చిటుక్కుమన్నా వినబడేంత నిశ్శబ్దంగా వుంది.

"ఆకవరు మీ దగ్గర వుంచండి- ఈ పెన్సలును వీడిచ్చే క్రొత్త బ్లేడుతో చెక్కుతాను. చెక్కుతూండగా ముక్కు విరిగిపోతే ఆకవరును నాకివ్వండి; లేకపోతే వాడి

కివ్వండి." అన్నాడు, ఎర్రచొక్కా కుఱ్ఱాడు. అంతే నన్నట్లు ప్రక్కన వున్న గళ్ళచొక్కా-కుఱ్ఱాడు తల వూపాడు.

నిన్నకొన్న పెన్సిలు బయటికి తీసి, గళ్ళచొక్కా కుఱ్ఱవాడు యిచ్చిన క్రొత్త 'సెవనోక్లాక్' బ్లేడు తీసి పెన్సిలు చెక్కటం మొదలెట్టాడు. కుఱ్ఱాళ్ళంతా నిశ్శబ్దంగా పెన్సిలువైపే చూస్తూ కూచున్నారు. 'ఇలా క్లాసులో కూర్చుంటే వీళ్ళకు మేష్టర్ల దెబ్బ లెందుకు తగులుతై' అనుకున్నాను నాలో నేను.

ఇంతలో బాంబుపేలినంత పని అయింది. కూర్చున్నవాళ్ళలో సగంకు పైగా లేచి సంతోషంతో వెఱ్ఱికేకలు వేయటం మొదలెట్టారు. గళ్ళచొక్కా కుఱ్ఱాడి ముఖం తెల్లబారింది. అతడు, అతని జట్టు కుఱ్ఱాళ్ళు అసూయగాలేచి విసురుగా వెళ్ళిపోయారు. వాళ్లజట్టు వాళ్లు వెళ్ళేకొద్దీ ఇంకా కేకలేశారు వీళ్లు - ఇల్లు ఎగిరిపోతుందా అనిపించింది.

"అర్ధరూపాయికాదు రూపాయి ఇవ్వవచ్చు - ముక్కు బలే విరిగిందిలెండి!" అన్నాడు, ఎఱ్ఱచొక్కా అబ్బాయి. నేనా కవరును కుర్రాడి చేతిలోపెట్టేశాను. దాన్ని చించి లోపలవున్న ఐదురూపాయల నోట్లుతీసి ఒకరూపాయి ఆ అరుస్తున్న కుఱ్ఱాళ్ళలో ఒకడికిచ్చాడు. దాంతో ఇంకా రెట్టింపుగోలగా ఆ గుంపు రోడ్డు ఎక్కింది.

ఆ కుఱ్ఱాడు మమ్మల్నికూడా హోటలుకు తీసుకెళ్ళాడు. అల్పాహారం (అంటే స్వీటు, హాటు, కాఫీ) పూర్తయాక, "ఒకటి అడుగుతా కానీ, నిజం చెప్పతారా?" అనిఅడిగాడు - తలవూపాను సరేనని.

"ఆ పెన్సిలు అసలు ఖరీదు అణాకంటే ఎక్కువ కాదుకదూ-?" అన్నాడు నెమ్మదిగా.

ఇద్దరం నోళ్లుతెరిచాం. కుఱ్ఱాడు లేచి టేబుల్ మీద అణావుంచాడు.

(43-వ పేజీ చూడండి)



సింహం (డిజైను)

పచ్చవ నరసింహారావు. V ఫారం, విజయవాడ.

# డాన్ క్విక్ సెట్

## పూర్వ కథ

లామంచా అనే గ్రామానికి చెందిన డాన్ క్విక్ సెట్ అనే వెర్రివెంగళప్ప తానొక వీరుడుగా చెలామణీ కావాలనుకొని, శాంకో పాంజా అనే చదువురానివాణ్ణి తన బంటుగా చేసుకొని వీరవిహారాలకు బయలుదేరాడు. ఎవరో ఒక ఆడామెనుచూచి ఆమెకు డల్ సీనియా రాకుమారిఅనే బిరుదాన్ని తనమనస్సులోనే యిచ్చేసి, ఆవిడను మెప్పించటంకోసమే తానీ ధర్మరక్షణమనే కఠోరదీక్షను స్వీకరించానని నమ్మాడు. లోగడ డాన్ క్విక్ సెట్ గారు తాను జయించబోయే దీవుల్లో ఒకదానికి శాంకో పాంజాను గవర్నరుగా చేస్తానన్నాడు. వాడా మాట నమ్మి ఆరోజుకోసం ఎదురు చూస్తున్నాడు. ఇలా వుండగా ఒకరోజు వీళ్ళకు ఒక డ్యూక్ దంపతులు తారసిల్లారు. వారికి వీళ్ళిద్దరినీ వేళాకోళం చేయాలనే బుద్ధి పుట్టింది. ఆ స్వామినీ, బంటునీ తమ దేవిడీకి తీసుకుపోయి, తిండి అదీ పెట్టి బాగా ఆదరించారు. డాన్ క్విక్ సెట్ గారిచ్చిన మాటప్రకారం తానే శాంకోపాంజాను బార్ టారియా అనే పట్టణానికి గవర్నరుగా నియమించాడు ఆడ్యూక్. ఈయన గవర్నరు హోదాలో ప్రవేశించిన మొదటిరోజునే డ్యూక్ భవనం నుంచీ ఒక తాఖీదువచ్చింది. శత్రువులెవ్వరో యీదీవి మీద దండెత్తనున్నారనేవార్త ఆ తాఖీదుద్వారా తెలిసింది.

## 19

డ్యూక్ భవనం నుంచీ వచ్చిన తాఖీదును బట్టి గవర్నరు శాంకోపాంజాగారి దీవిపై ఏక్షణాన అయినా శత్రువులు దాడి ఎత్తి రావచ్చునన్న దిగులు అందరినీ పట్టుకు వేధిస్తున్నది. అయినప్పటికీ అటువంటి సంఘటన ఏదీ జరగకుండానే ఒక వారం రోజులు ప్రశాంతంగా గడిచిపోయాయి. ఈ వారం రోజుల పొడుగునా శాంకో పాంజాగారికి పైనుంచీ వచ్చే శత్రువులవల్ల ఎట్టి బాధా కలులేదన్న మాట వాస్తవమే కానీ, గవర్నరుపదవిని నిర్వహించటంలో గల గురుతర బాధ్యతలన్నీ కలిసి యీాయనను క్రుంగదీశాయంటే, అందులో అబద్ధం కానీ, అతిశయోక్తి కానీ ఏమీాలేదు.

ఆ ఏడవనాటి రాత్రి మాత్రం హఠాత్తుగా పరిస్థితులు మారిపోయాయి. శాంకో పాంజాగారిభావి జీవితాన్నంతటినీ తారుమారుచేసిపారేసిన ఆ దుస్సంఘటన నాటిరాత్రే జరిగింది.

ఆరోజు రాత్రి ఆయన పరిపాలనకు సంబంధించిన పనులన్నీ ముగించుకొని,ఆస్థాన వైద్యుడు సిఫార్సు చేసిన తిండి ఏదో యింత తిని, పొద్దుపోయాక బద్ధకింగా వచ్చి, పక్కమీాద పడుకొన్నారు. పగలంతా పడ్డ చికాకుతో ఆయనకు ఎంతకీ నిద్దర రాలేదు. ఊరికే ఆ పక్కమీాదనే పడుకొని యిటునుంచి అటు, అటునుంచి యిటూ తెగ దొర్లారు. అలా దొర్లగా దొర్లగా, ఎట్టకేలకు ఆయనకు కంటిమీాదికి కునుకు వస్తూ వస్తూ వున్నది. ఇప్పటికైనా నిద్ర వస్తున్నది కదా అని ఆయన సంతోషించారు. కానీ యింతలో బయట వున్నట్లుండి ఒక్కసారిగా పెద్దగోల బయలుదేరింది. చర్చిలో గంటలు వెర్రి ఎత్తినట్టు మోగుతున్నాయి. కుక్కలు భౌభౌమని అరుస్తున్నాయి. మనుష్యులు పెద్దగా కేకలు పెట్టుకొంటూ శాంకో పాంజాగారి శయన మందిరం వైపుకే వస్తున్నట్లు తోచింది. పక్కమీాద పడుకొని వున్నవారల్లా, ఆశబ్దాలు విని, శాంకో పాంజాగారు ఒక్కసారిగా లేచి కూర్చొని, ఆ శబ్దం ఏమిటైందీ, ఏవైపునుంచీ వస్తున్నదీ పరీక్షగా వినటం మొదలుపెట్టారు. ఆశబ్దం అంత కంతకూ దగ్గిరకు వస్తున్నది. మామూాలుగా మనుష్యుల గొంతుకలే కాక, రణభేరీలు, తప్పెట్లు, తాళాలూ కూడా వాయిస్తున్నట్లున్నారు. వారం రోజులక్రితమే శత్రువులు దాడి చెయ్యబోతున్నారన్న వార్త తెలిసివుండటమూ, యిప్పుడు యిలా అర్ధరాత్రివేళ రణభేరీమ్రోతలు వినిపించటంతో ఘనత వహించిన గవర్నరు శాంకో పాంజాగారి గుండెధైర్యం సడలిపోయి వణుకు, పుట్టకు

వచ్చింది. అవతల ఆ శబ్దాలు అంతకంతకు బిగ్గరగా వినిపిస్తూ వుంటే, యివతల శాంకో పాంజాగారి గుండె బెదురుకూడా ఎక్కువ కాసాగింది. చివరకు యిక ప్రయోజనం లేదని, పిట్టగోడమీదగా దూకి పారిపోదామను కొన్నారు—శాంకోపాంజాగారు. కాలికి జోడు తగిలించుకొని గదిలోనుంచి బయటకు వచ్చి, పిట్టగోడ ఎక్కబోతుండగా, ఎవరో యిరవైమంది దాకా మనుష్యులు యీయనవద్దకు నురుసులు కక్కుకొంటూ పరుగెత్తుకువచ్చారు. వారందరి చేతుల్లోనూ కత్తులు వున్నాయి. కొందరి చేతుల్లో కాగడాలు వెలుగుతున్నాయి.

ఈయనదగ్గరకు వచ్చీ రావటమే తడవుగా అందరూ ఏకకంఠంతో "ప్రభూ! ప్రభూ! మన దీవిని శత్రుసేనలు చుట్టుముట్టాయి. ఏలినవారి భృత్యానుభృత్యులమైన మేమంతా ఏం చేయటానికీ తోచక కంగారుపడిపోతున్నాము. భీమబలులైన తాము కత్తినిచేతపట్టి శత్రుసేనలను సంహారించాల్సిన సమయం వచ్చింది." అని అరిచారు.

"అదేమిటి? నన్ను కత్తి పట్టుకోమంటారేమిటీ? కత్తియుద్ధం ఎలా చేయాలో నాకేం తెలుసూ?" అంటూ ఘనత వహించిన గవర్నరు శాంకో పాంజాగారు తన చేతకానితన్నాన్ని బయట పెట్టారు.

"ప్రభూ! తమరు పిరికిపందలు కారే! ఎందుకు అలా కంగారుపడిపోతున్నారు? కత్తి పట్టకపోతే మానె. ఇవిగో - శత్రువుతో పోట్లాడటానికీ, శత్రువు విసిరే దెబ్బలను కాచుకోవటానికి తగిన ఆయుధాలు మావెంట తెచ్చాము. తమరు గవర్నరుగారైనందుకు, వాటిని వెంటనే ధరించి, మమ్మ అందరిని పెద్దబజారుదాకా నడిపించండి." అంటూనే పెద్ద డాళ్లు రెండు పట్టుకొచ్చి గవర్నరుగారికి ముందు వైపున ఒకటి, వెనుక వైపున ఒకటి పెట్టి, పడిపోకుండా గట్టిగా తాళ్లతో బిగించి కట్టేశారు. ఆయన చేతికి ఒక యీటెనుకూడా అందించి యిక తమను నడిపించమన్నారు.

పాపం—శాంకోపాంజాగారు కదలబోయారు. రెండు వైపులా తగిలించివున్న ఆ డాళ్లు విపరీతమైన బరువు. వాటి బరువుకు మనిషి దించుకుపోతున్నారు. పైగా ఆ డాళ్లు మోకాళ్ల క్రిందివరకూ వచ్చి



ఆయన కదలటానికి వీల్లేకుండావుంది. అయినా సరే - గవర్నరుహోదాలో వున్నప్పుడు తనపై ప్రజలు వుంచిన విశ్వాసానికి వ్యతిరేకంగా నడుచుకోవటం తగదన్న పట్టుదలతో కాలు కదపటానికి ఒకటి రెండు సార్లు ప్రయత్నంచేసి చూశారు. ఆయన చేసిన ప్రయత్నాలమూలంగా ఫలితమేమీ లేకపోగా, ఆ రెండు డాళ్ల నడుమా కాళ్లు కదపటానికి వీల్లేక చెట్టంత మనిషి నేలమీద బోర్ల బొక్కలా పడిపోయారు. ఆ భంగిమలో ఆయనగారు నేలమీద పడివుండగా, అదాటుగా ఎవరైనా చూస్తే, యిది ఏదో మనిషి తలకాయ, మనిషి కాళ్లు వున్న కొత్తరకం తాబేలు అని పొరపాటు పడవలసిందే!

ఆయనగారు ఆ వరసను మెట్టతాబేలులా నేలమీద పడివుండి కాళ్లూ చేతులూ తెగ కొట్టుకొంటూ వుంటే, అవతల ఆ యిరవైమంది మనుష్యులూ తెచ్చిన కాగడాలన్నీ ఒక్కసారిగా ఆరిపోయాయి. అంతటా గాఢాంధకారం చుట్టుముట్టేసింది. ఆ చీకట్లో ఏదో పెద్ద చిందులాట. అందులోనే కత్తులు దూసినట్లు, యీటెలు విసురుతున్నట్లు కొన్ని

#  డాన్ క్విక్ సెట్ 

శబ్దాలు. కొంతసేపు ముష్టియుద్ధం జరిగినట్లు చప్పుళ్లు. ఇలా ఏవేవో వింత వింతశబ్దాలు వినవచ్చాయి. నిజంగా యుద్ధమే జరుగుతున్నదనిపించింది. ఆయుద్ధం నిరాఘాటంగా పది పదహేను నిమిషాలసేపు కొనసాగిపోయింది. ఆరెండు డళ్లసందునా పడి నలిగిపోతుందన్నందువల్ల ఆయనకు శారీరకమైన బాధ అంతకంతకూ ఎక్కువై పోతున్నది. అటు ఆ శత్రువులమూలంగానో, యిటు యీ భేతాళపు డళ్ల మూలంగానో తన కిక చావు తప్పదని శాంకో పాంజాగారు అనుకొంటూ వుండగా "ప్రభూ! ప్రభూ! విజయం మనదే! శత్రుశేషం లేకుండా చేసి పారేశాం! లేవండి. వేగమె వచ్చి శత్రుసేనలు వదిలి వెళ్ళిన నిధి నిక్షేపాలు మాకు పంచిపెట్టండి." అంటూ ఆ యిరవైమంది గొంతుకలూ చీకటిని చీల్చుకు వినిపించాయి.

శాంకో పాంజాగారి ప్రాణం అప్పటికే కడగట్టిపోయింది. నాలిక లోపలికి పీక్కుపోతున్నది. ఆపాద మస్తకం అభిషేకం చేయించుకొన్నట్లుగా చెమటలు దిగ్గారిపోతున్నాయి.

"నన్ను ముందుగా లేవదీయండి" అంటూ అతి హీన స్వరంతో పలికారు శాంకో పాంజాగారు. అది చెవినబడ్డ వాడెవ్వడో చప్పున వచ్చి, మరొకరిద్దరి సహాయంతో ఆయనను ఎలాగైతే నేం లేవదీసి నిల్చోబెట్టాడు. మళ్ళీ ఆ గొంతుకలు "శత్రుసేనలు వదిలిపెట్టిన నిధి నిక్షేపాలను మాకు మీ చేతిమీదిగా పంచి పెట్టమని" కోరాయి.

"నిధి నిక్షేపాల మాట ఎలా తగులబడ్డా సరే కానీ, మీలో ఏ ఒక్కడికైనా నా మీద కాస్తంత కరుణ వుంటే, గుక్కెడు సారా తెచ్చి యిచ్చి పోతున్న నా ప్రాణాన్ని నిలబెట్టమని మాత్రం నేను వేడుకొంటున్నాను" అన్నారు శాంకోపాంజాగారు, అతిదీనంగా.

ఎవడో పరుగెత్తుకొంటూ పోయి సీసాడు సారా తెచ్చి ఆయన నోటికి అందించారు. మరో యిద్దరు ముగ్గురు మనుష్యులు చేరి, డళ్లకు కట్టిన తాళ్లన్నీ విప్పి, ఆయన వొంటిపైగల బరువునంతా తగ్గించేశారు.

మరి—అంతకు ముందు ఆయన మానసికంగా ఎంత ఆందోళనపడి వున్నారో, శారీరకంగా ఎన్ని దెబ్బలు తిన్నారో కానీ, కట్లు అన్నీ తీసేసిన వెంటనే మూర్ఛపోయారు. పరిస్థితి యింతవరకూ వచ్చి, శాంకో పాంజాగారు మాటా మంతీ లేకుండా బిగుసుకుపోవటం చూసేసరికి, యిన్ని రోజులుగా యీాయనను ఆడించటంకోసం, డ్యూక్ దంపతుల ఆజ్ఞల మేరకు, పాత్రాభినయం చేస్తున్న యింతమంది మనస్సులూ ఒక్కసారిగా చివుక్కుమన్నాయి. నవ్వులాటకని మొదలుపెట్టిన యీ భాగోతం చివరకు యిలా చావుల్లోకి దిగుతోందని వాళ్లు భయపడిపోయారు. అందరూ ప్రాణాలు వుగ్గపెట్టి ఆయన మొఖంకేసే చూస్తూ వుండిపోయారు.

ఉఛ్వాస నిశ్వాసాలు కూడా ఆగిపోయిన శాంకో పాంజాగారు వున్నట్లుండి డొక్కలు ఎగరవేయటం ప్రారంభించారు. అది చూశాక ఆ యిరవై మందికీ ప్రాణాలు లేచి వచ్చాయి. ఎవరికి తోచినది వారు, ఎవరికి చేతనైనది వారుగా, సకలోపచారాలు చేసి, శాంకో పాంజాగారిని బ్రతికించారు. ఆయనకు క్రమంగా స్పృహ వచ్చింది.

సొంతం మన స్పృహాలోకి వచ్చీరాకముందే ఆయన తనదగ్గిరగా వున్నవాడిని "యిప్పుడు టైం ఎంతైంద"ని అడిగారు. వాడు తెల్లవారవస్తున్నదని సమాధానం చెప్పాడు. ఇక ఆ తరువాత వేరే ఏ విషయాన్ని గురించీ ఆయన అడగకుండా, నెమ్మదిగా మోకాళ్లమీద లేచి, చేతులు ముందుకు జాపి నేల మీద ఆనించి డేకొంటూ డేకొంటూ ముందుకు కదిలిపోయారు. అలా నత్తగుల్లలా నేలమీద పాకుతూ పోయిపోయి, తన భవనం చేరుకున్నారు. భవనానికి చేరినవాడు తనగదికి పోకుండా సరాసరి గుర్రాల శాలవైపుకు దారితీశారు. అక్కడ ఆ చీకట్లోనే తన ముద్దులగాడిద 'డాపుల్' ఎక్కడ వున్నదో వెతికి తెలుసుకొని, అది కనుపించగానే కళ్లె

వెంట నీళ్లు ఏకధారగా కారుస్తూ, దాని తలను తన రెండు చేతులతోనూ పట్టుకొని, తన హృదయానికి హత్తుకొని, దాని నుదుటిపై ముద్దు పెట్టుకొన్నారు.

"నా 'డాపుల్'! ఇన్ని ఏళ్లుగా నాతోపాటే ప్రయాణాలు చేస్తూ, నాతోపాటే వుపవాసాలు వుంటూ, నాతోపాటే అన్ని అవమానాలు, అన్ని హింసలు అనుభవిస్తూ వున్న నిన్ను, అర్ధాంతరంగా వదిలేసి అర్హతలేని యీ గవర్నరుపదవికోసం ఆశించినందుకు గదా-నేను యిన్నిరకాల యిడుములు పడవలసివచ్చింది. నీజంట వీడకుండా వున్నంత కాలమూ, నాకు యీమాదిరి కష్టాలు ఒక్కటి కూడా రానేలేదు. అంతటితో నేను సంతృప్తి పడి, యీ పేరాశల జోలికి పోకుండా వుండవలసింది. నన్ను నమ్మిన నిన్ను ఏనాడైతే వదిలి గద్దెలెక్క కులకాలని గంతులు వేశానో, ఆనాడే నాకు కష్టాలు ప్రారంభమైనాయి." అంటూ ఒకటే ధోరణిలో ఆ గాడిదను కౌగలించుకు ఏడ్చి, ఏడ్చి, ఎక్కిళ్లు తెచ్చుకొన్నారు. ఎక్కిళ్లు ఆగకముందే వున్నచోటినుంచీ లేచి ఆ గాడిద తాలూకు జీనూ అదీ, అక్కడే ఒకమూల పడేసివుంటే, - దాన్ని పదిలంగా 'డాపుల్'మూపుకు తగిలించి యిటు తిరిగి చూశాడు.

శత్రు సంహార కాండలో పాల్గొన్న ఆ యిరవైమంది మాత్రమే కాక, ఆస్థానానికి చెందిన మరొక అరవైమందిదాకా వుద్యోగులు యింతసేపూ యీయన పాకి వస్తూంటే ఆయన వెనకాలే వచ్చారు కాబోలు! ఇక్కడ పశువుల శాలకు చేరాక యీయన గుండెలు పగిలిపోయేట్టుగా ఏడుస్తూ వుంటే కూడా, వాళ్లు ఆవరసను బెల్లం కొట్టిన రాళ్లకు మల్లే, వూరికే చూస్తూ నిల్చుండి పోయారు కానీ, ఒక్కడూ ధైర్యం



లంబాడీ యువతి

(ఒంటిగీత బొమ్మ)—మిస్. బాల (విజయవాడ)

# డాన్ క్విక్ సెట్

చేసి 'ఏమిటి' అని యీాయనను పలుకరించలేక. పోయాడు.

శాంకో పాంజాగారు కూడా మనస్సు అంతగా కలవరపడివున్న కారణంచేత వాళ్లను వెంటనే పలుకరించలేక, డాఫుల్ మూాపురు జీను తగిలించే పని సాంతం పూర్తి చేశారు. దెబ్బలు తగిలి పట్టుకు పోయిన కాళ్లతో ఎల్లాగో తానే తంటాలుపడి గాడిదమీాదకు పాకి, ఎక్కి కూర్చొని, అప్పుడు వీళ్లందరి ముఖాలూ ఒక్కసారి కలియచూసి "సోదరులారా! నన్ను నా పూర్వపు బ్రతుకుబాటకే తిరిగి పోనివ్వండి. ఈ గవర్నరుపదవి, యీావైభోగం, యీా అధికారం, యీా ఆడంబరం నన్ను ఉక్కిరి బిక్కిరి చేసేస్తున్నాయి. ఇక ఒక క్షణమైనా యీా గవర్నరు పదవిని నాతలపై పెట్టుకొని తిరగలేను, క్షణ క్షణానికి యిన్ని చావులు చావలేను. ఇన్ని రకాల మనోవ్యధలతో యీా రాజసౌధంలో హంసతూలికా తల్పాలపై, పట్టు పీతాంబరాలు కప్పుకు పడుకోవటం కంటే, హాయిగా స్వేచ్ఛగా స్వతంత్రంగా బ్రతుకుతూ ఏ మర్రిచెట్టుక్రిందనో, గొఱ్ఱెతోలు కప్పుకు పడుకోవటంలోనే ఎక్కువ సుఖమున్నదనీ, ఎక్కువ ఆనందం వున్నదనీ నాకు యిప్పటికి తెలిసి వచ్చింది. కనుక, నేను గవర్నరుపదవి అనే యీా బానిసత్వానికి రాకముందు ఎలాగైతే బ్రతికానో, ఆ పద్ధతికే తిరిగి వెళ్లిపోతున్నాను. మీారంతా యిన్ని రోజులుగా నాపట్ల దయజూపినందుకు యివే నావందనాలు. 'డ్యూక్' గారు నా విషయ మెన్నడైనా అడిగితే, పుట్టుదరిద్రుడుగా పుట్టిన యీా శాంకో పాంజాగాడు బ్రతికినన్నినాళ్లు బ్రదుకబోడనీ, యిక మిగిలివున్న ఆరోజులైనా పుట్టు దరిద్రుడుగానే గడపి తనువు చాలించటంకోసం గవర్నరుగిరీ వదిలిపెట్టి వెళ్లిపోయాడనీ చెప్పండి. ఈ గవర్నరు పదవిని స్వీకరించే ముందు నాకు దమ్మిడీ ఆస్తి లేదు. దమ్మిడీ ఆస్తి అయినా సంపాదించకుండానే యీా పదవిని యింతటితో వదిలేస్తున్నాను. ఇక నాకు శెలవు యిప్పించండి" అంటూ చేతులు రెండూ ఎత్తి వాళ్లకు దణ్ణం పెట్టాడు.

ఆస్థానవైద్యుడి వేషం అంత బాగా యింత కాలమూ నటించిన ఆ పెద్దమనిషి, శాంకో పాంజాగారు ఆడిన ఆ మాటలకు చాలా విచారపడ్డాడు. ఆయన అన్న ప్రతిమాటలోనూ ఎంతో యధార్థముందని గుర్తించి, యింత మంచి హృదయంగల మనిషిని వినోదంకోసమని ఏడిపించి నందుకు ఆయన లోపల చాలా బాధపడి, మిగిలినవారందరినీ తప్పుకోమని శాంకో పాంజాగారి గాడిద కదిలి పోయేందుకు వీలుగా దోవ చేశాడు.

# డాన్ క్విక్ సెట్

ఆ గుంపులోనే మరొకరిద్దరు మనుష్యులు ముందుకు వచ్చి, మాజీ గవర్నరు శాంకో పాంజాగారికి దారి పొడుగునా కాపలాగా వుండగలందులకు తమలో ఎవరమైనా ఆయన వెంట రావటానికి సిద్ధంగా వున్నామని విన్నవించుకొన్నారు. మరొక జట్టు ముందుకు వచ్చి, అయ్యగారు ప్రయాణంలో వుపయోగించుకోవటానికి వీలుగా తినుబండారా లేవేవో తెచ్చిపెట్టుతామన్నారు.

“సోదరులారా ! పేద రైతుల కుటుంబంలో పుట్టి, బంటుగా బ్రతికిన నాకు సేవకులా ! వద్దు! వద్దు!! నా కంతటి అర్హత లేదు. కాకపోతే మీరంత యిదిగా అడుగుతున్నారు కాబట్టి, నాకు తినటానికి యింత రొట్టెముక్క, కాస్త జున్ను యిస్తే యివ్వండి; నా గాడిద ‘డాపుల్’కు మాత్రం యిన్ని వులవలు తెచ్చిపెట్టండి.” అని చేతులు జాపాడు శాంకో పాంజా గారు. (ఒక్క విషయం—శాంకో పాంజా గవర్నరు పదవికి రాజీనామా యిచ్చిన మాజీ వుద్యోగిగా తయారైనాడు కాబట్టి, ఆయననుగురించి మనం మాట్లాడే టప్పుడు యిక ‘గారూ’, ‘గీరూ’ అనక్కర లేదు. లోకం తిరుకూడా అంతేగా ! ఏమనిషి నైనా మనం మన్నిస్తున్నామంటే, ఆయనకు వున్న హోదాను బట్టే కాని ఆమనిషికి వుండే విలువను బట్టి కాదాయె. అందుచేతనే యికమీదట శాంకో పాంజాను గురించి మాట్లాడేటప్పుడు మనం ‘గారూ’, ‘గీరూ’ అనకపోయినా ఫరావాలేదు!)

వాళ్లు ఆయన అడిగిన రొట్టెముక్క, జున్ను, వులవలు వెంటనే తెచ్చిపెట్టారు. ఆయన వాటిని అంది పుచ్చుకొని అతిజాగ్రత్తగా మూటలు కట్టుకొని, అక్కడ నిలబడివున్న వారందరిలో ప్రతి ఒక్కరినీ బిగ కౌగలించుకొని, కనుకొలకులవెంట అశ్రువులు సంతతధారగా కారిపోతూవుండగా, పేరుపేరునా అందరివద్ద శెలవు తీసుకొని గాడిద నెక్కి బయలు దేరాడు.

గవర్నరుగిరీకి ఒప్పుకోకముందు తాను వీర కేసరి డాన్ క్విక్ సెట్ గారి బంటు. కాబట్టి గవర్నరుగిరీకి రాజీనామా యిచ్చాక మళ్ళీ ఆయనదగ్గరకే పోవటం తన విధాయకమని భావించినవాడై, శాంకో పాంజా, డాన్ క్విక్ సెట్ గారు వున్న డ్యూక్ భవనానికి పోవటానికే నిశ్చయించుకొని, ఆవూరివైపుకు తన గాడిదను నడిపించాడు.

(ఇంకావుంది)

## ★ పందెంకోసం ★

(37-వ పేజీ తరువాయి)

మాకిద్దరకూ పిచ్చిఎక్కినంతపని అయింది - ఇతను మళ్ళీ అణా ఇస్తున్నాడెందుకా అనుకున్నాం. ఒకరినొకరం చూచుకొని ఇటు తిరిగేటప్పటికి కుఱ్ఱాడు లేడు! తారాజువ్వలా రోడ్డుమీద పరిగెత్తుతున్నాడు.

ఏడుపొచ్చినంతపని అయింది మాకు. చచ్చినట్లు రూపాయన్నర హోటలుయజమానికి ముట్టచెప్పుకొని ఇంటికి బయలుదేరాం. సినిమాకని తెచ్చిన డబ్బిలా ఖర్చయిందే అన్న దిగులు పట్టుకుంది విశ్వానికీ, నాకూ. ఇద్దరం ముఖాలు వేలవేసి నడుస్తున్నాం. మా వెనుకవైపు పెద్దగా నవ్వు వినిపించింది. అటుతిరిగాము -

“ఇప్పటికయినా తెలిసిందా ఎందుకో !...పందెం కోసం!” అంటూనే తుఱ్ఱుమన్నాడు, పక్క సందులోకి, ఎఱ్ఱచొక్కా కుఱ్ఱాడు. ★

ఇరుగు పొరుగున వుండే యిద్దరు గుమాస్తాలు ఒకనాడు సమావేశమై పిచ్చాపాటీ మాట్లాడుకొంటున్నారు. అందులో ఒకడు యిలా అన్నాడు.—

“మా ఆవిడ భలే పొదుపుగల మనిషిలే ! క్రిందటి ఏడు పాత పంచలన్నీ చింపి నాకు బనీన్లు కుట్టి పెట్టింది. ఈఏడు ఆబనీన్లు అన్నీ కలిపి తనకు బొంత కుట్టుకొంటోంది.”



గజాననావారి "కోడరికం"లో ఎస్. వరలక్ష్మి.

# సినిమా పరిభాష

సినిమా పరిశ్రమలో కొన్ని కొన్ని పారిభాషిక పదాలు తరుచుగా వినిపిస్తూ ఉంటాయి. మామూలుగా మనం ఉపయోగించే మాటలనే ప్రత్యేకార్థాలలో సినిమా పరిశ్రమవారు ఉపయోగిస్తూ ఉంటారు. అట్లాంటి కొన్ని పదాల అర్థాలు ఈ కింద ఇవ్వబడినాయి.

సినిమా తియ్యటానికి ముందు కొంత 'పేపర్ వర్కు' (కాగితంమీద పని) చెయ్యవలసి ఉంటుంది. ప్రతి దర్శకుడూ అసలు షూటింగ్ మొదలుపెట్టడానికి ముందు స్క్రిప్టు అనేదాన్ని రెడీగా పెట్టుకుంటాడు. ఈ స్క్రిప్టులో ఆఖరికి తెరమీద కనిపించబోయే ఫిల్ము స్వరూపం ఆమూలాగ్రం, ప్రతి చిన్న వివరంతో సహా రాసివుంటుంది. ఈ స్క్రిప్టును తయారు చెయ్యటంలో స్థూలంగా మూడు దశలుంటాయి.

మొదటి దశను "సినాప్సిస్" అంటారు. అంటే సెనిమాకథ రాసే మనిషి ఆ కథలో వచ్చే ప్రధాన పాత్రలను, వారు చేసే పనులను, కథలో వచ్చే ప్రధాన ఘట్టాలను టూకీగా రాసుకు వస్తాడు. కథయొక్క సారాంశం, ఆ కథద్వారా చెప్పదలుచుకున్న విషయం ఈ సినాప్సిస్‌లో ప్రతిపాదించబడుతుంది.

తరవాత దశ "ట్రీట్‌మెంట్." ఇది కూడా కథను చెబుతున్నట్టుగానే రాస్తారు. కాని ఇది ఎక్కువ పేజీలు పడుతుంది. ఇందులో కథలోని యావత్తు వివరాలు, యావన్మంది పాత్రలు, విపులంగా ఉంటాయి. ప్రతి సన్నివేశాన్ని ఏ విధంగా ఫిలిముతీస్తే బావుంటుందో, ఏ పాత్రస్వభావం ఎటువంటిదో, ఒకపాత్రకీ మరొక పాత్రకీ గల సంబంధం ఎలాంటిదో స్పష్టంగా ఉంటుంది. సినాప్సిస్ చదివితే ఆ కథ సినిమా తియ్యటానికి ఉద్దేశించబడిందని తెలుసుకోలేము. కాని ట్రీట్‌మెంటు చదివితే అది ప్రత్యేకంగా సినిమాకోసం ఉద్దేశించబడిందని స్పష్టంగా తెలియాలి. ట్రీట్‌మెంటు రాసేవాడు కథ కళ్ళఎదురుగా జరుగుతున్నట్టు వర్ణించాలి.

ఈ దశ తరవాత జరిగే పని "స్క్రిప్టు" తయారుచెయ్యటం. దీన్నే సినేరియో అనికూడా అంటారు. కథ యావత్తూ కొన్ని ఘట్టాలుగాను (సీక్వెన్సు), ఘట్టాలు కొన్ని సన్నివేశాలుగాను, సన్నివేశాలు షాట్సుగాను విభ



నళినీ జయవంత్ కాదు, "షామా – పర్వానా" హిందీచిత్రంలో నీల్ కమల్. నిర్మాత, దర్శకుడు కె. భూషణ్. కెమేరా పి. సి. సిన్హా.

# సినిమా పరిభాష

జించబడతాయి. షూటింగ్ స్క్రిప్టులో తెరమీద మనం చూడబోయే కథ ఏ వరుస క్రమంలో ఉంటుందో అంతా రాయబడి వుంటుంది. ఏ ఘట్టం తరవాత ఏ ఘట్టం, ఏ సన్నివేశం తరవాత ఏ సన్నివేశం, ఏ షాట్ తరవాత ఏ షాట్ రావాలో పూర్తిగా రాయటం జరుగుతుంది. ప్రతి సన్నివేశంయొక్క మానసికస్థితి, (విచారంగాని, సంతోషంగాని) ఆ మానసిక స్థితిని ప్రేక్షకులకు తెలియ జెయ్యాలంటే లైటింగ్ ఎలా ఏర్పాటు చెయ్యాల్సిందీ, కెమేరాను ఏ కోణంలో ఎంత దూరంలో ఉంచాల్సిందీ, ఒకషాట్‌ను ఎంతసేపు నిలిపి వుంచాలీ, పరిసరాలను ఏవిధంగా అలంకరించాలీ మొదలైన యావత్తు వివరాలు రాయబడతాయి. ఈ స్క్రిప్టును సాధారణంగా దర్శకుడే రాయగలుగుతాడు. అతడు కూడా కెమేరామన్‌తో సంప్రదించిగాని రాయలేడు.

షాట్ అంటే ఏమిటి? మనం తెర మీద చూసే దృశ్యాలు నిమిష నిమిషానికి మారిపోతూవుంటాయని మనకి తెలుసు. ఉదాహరణకి ఒక వ్యక్తి ఒక్కడే నిలబడి ఎటో చూస్తోఉండటం ముందు కనిపిస్తుంది. ఆ దృశ్యం మారిపోయి అతను దేనికేసి చూస్తున్నాడో ఆ వస్తువు తెర మీదికి వస్తుంది. మళ్ళీ ఆ దృశ్యం మారిపోయి మొదటివ్యక్తీ, అతను మాసేవస్తువూ రెండూ తెరమీద కనబడటం జరుగుతుంది. ఇలాగ మాటిమాటికీ మారిపోయే దృశ్యాలను షాట్స్ అంటారు. ఈ షాట్ అనేది కొన్ని ఫ్రేములు చేరితే ఏర్పడుతుంది. పన్నెండు అంగుళాల సెల్యులాయిడ్ ముక్కను తీసుకుంటే అందులో 16 ఫ్రేము లుంటాయి. 24 ఫ్రేములు తెరమీద జరగటానికి దాదాపు ఒక సెకండు పడుతుంది. ఇలువంటి ఫ్రేములు కొన్ని చేరితే షాట్ ఏర్పడుతుంది.

ఒక్కొక్క షాట్ తియ్యటానికి కెమేరాను ఉన్న స్థానంలోనుంచి కదల్చవలసివస్తుంది. కెమేరా సెటప్ షాట్ షాట్‌కీ మారుస్తారు. ఈ షాట్లలో చాలా రకాలున్నాయి. కెమేరాకు, ఫొటో తియ్యబడే వస్తువుకూ గల దూరాన్నిబట్టి కొన్ని షాట్లకు పేరు పెడతారు. ఒకటి క్లోజప్. ఒక సన్నివేశంలో ఒక వస్తువును తెరమీద పెద్దదిగా చూపవలసివచ్చినప్పుడు క్లోజప్ తీస్తారు. ఏ వస్తువును పడితే ఆ వస్తువును పెద్దదిగా చూపవలసిన అవసరం రాదు. ఆ సన్నివేశానికల్లా అత్యంత ప్రధానమైన ఒక వస్తువును అది చాల ముఖ్యమైనది సుమా అని ప్రేక్షకులకు చూపించటానికే క్లోజప్ తీస్తారు. ఒక విషాదసన్నివేశంలో ఒక వ్యక్తి విషాదాన్ని ప్రేక్షకుల మనస్సులో హత్తుకునేలాగ చెయ్యటానికి ఆ వ్యక్తి ముఖాన్నిగాని, లేక కన్నీళ్లు తొణికే రెండు కళ్ళనుగాని క్లోజప్ తీయవచ్చు. ఇందువల్ల విషాదం మరింతగా పోషించబడుతుంది.

ఇలాగే కెమేరాకు, ఫొటో తియ్యబడే వస్తువుకూ గల దూరాన్నిబట్టి క్లోజ్ షాట్, మీడియం క్లోజ్ షాట్, మిడ్ షాట్, మీడియం లాంగ్ షాట్, లాంగ్ షాట్ అనే పేర్లు వచ్చాయి. సన్నివేశంలోని పరిస్థితినిబట్టి కెమేరాను ఎంతదూరంలో ఉంచాల్సిందీ దర్శకుడు నిర్ణయిస్తాడు.

కెమేరా ఎటుపడితే అటు తిప్పటానికి వీలైన సాధనం. కెమేరాను ఉన్నచోటి నుంచి కదల్చకుండానే అటూ ఇటూ తిప్పవచ్చు. ఎదురుగా ఉన్న వస్తువులూ, మనుషులే కాకుండా, ఇంకా చుట్టుపక్కలఉన్న వస్తువులను కూడా ఫొటో తియ్యవలసిన అవసరంవస్తే, కెమేరా తన ఇరుసుమీద తనే పక్కలకు తిరుగుతుంది. ఇటువంటి షాట్‌ను "పాన్‌షాట్," లేక "పానింగ్" అంటారు. "పెనోరమా" అనే మాటనుంచి పానింగ్ అనే మాటవచ్చింది. అలాగే కెమేరాను పైకీ కిందికీకూడా తిప్పవచ్చు. దీన్ని "టిలింగ్" అంటారు. కెమేరాను ఒక ట్రక్ మీద కెక్కించి ఫొటో తియ్యబడే వస్తువునుంచి దూరంగా గాని, దగ్గరగా గాని కదుల్చుతారు. పానింగ్, టిల్టింగ్, ట్రాకింగ్ చెయ్యటానికి వేరే షాట్ అవసరం లేదు. కెమేరాను క్రేన్ మీద కెక్కించి పైనుండికూడా ఫొటో తియ్యవచ్చు. దీన్ని క్రేన్‌షాట్ అంటారు. ఏ సన్నివేశంలో ఏమాదిరి షాట్ అవసరమో షూటింగ్ స్క్రిప్టులో ముందే రాసుకుంటారు.

విడివిడిగా తీసిన షాట్లను కలపటంలో అనేక రకాలున్నాయి. అయిపోతున్న షాట్‌ను ప్రారంభం కాబోతున్న షాట్‌ను మధ్యలో ఏమాత్రం విరామం లేకుండా కలిపినప్పుడు దాన్ని కట్ అంటారు. ఒక షాట్ అంతర్ధానమై మధ్య స్వల్ప విరామం ఉండి తరవాత మరొక షాట్ రావటానికి ఫేడిన్, ఫేడౌట్ అంటారు. ఒక షాట్ పూర్తిగా అంతర్ధానమవకుండానే మరొక షాట్ కనిపించటం మొదలిడితే దాన్ని డిసాల్వ్ లేక మిక్స్ అంటారు. డిసాల్వ్‌లో రెండు షాట్లూ క్షణంసేపు ఒకదానిపై ఒకటి సూపర్ ఇంపోజ్ అయి కనిపిస్తాయి. వైప్ అనేది మరొక పద్ధతి. ఒకషాట్‌ను తెరమీధినుంచి తుడిచివేసుకుంటూ మరొకషాట్ ప్రవేశిస్తుంది. ఈ రెండు షాట్‌లకు మధ్య ఒక అంచుకూడా కనిపిస్తుంది. ఇది వైప్.

విడివిడి షాట్లను కలపటంలో ఇన్ని పద్ధతులున్నప్పటికి తెలివైన దర్శకుడు ప్రతిపద్ధతినీ ఒక ప్రయోజనాన్ని ఆశించి మరీ ఉపయోగిస్తాడుగాని ఇష్టం వచ్చినట్టు ఉపయోగించడు. ఒక విషాదభరిత మైన సన్నివేశం ముగుస్తోందనుకోండి అది ముగిసిన కొన్ని క్షణాలదాకా ఆ సన్నివేశం ప్రేక్షకుల మనస్సులో మెదులుతూనే వుంటుంది. అందుచేత ఆ షాట్‌ను వెంటనే తొలగించగూడదు. నెమ్మదిగా, బరువుగా, వెళ్ళ లేక వెళ్ళ లేక వెళ్ళిపోతున్నట్టు ఆ షాట్‌ను తొలగిస్తారు. తరవాత షాట్ రాలేక రాలేక వస్తున్నంత నెమ్మదిగా తీసుకువస్తారు. ఇలాగే సన్నివేశంయొక్క అవసరాన్ననుసరించి మిగతా పద్ధతు లుపయోగిస్తారు. ★

పల్లెటూరి బడి తనిఖీ చేయటానికి వచ్చిన ఇన్స్పెక్టరు గారు: "ఒక పశువుల దొడ్లో పది గొర్రె లున్నాయి. వాటిలో అయిదు గొర్రెలు కంచె దూకి బయటికి పోయాయి. దొడ్లో ఇంకెన్ని ఉంటాయి."

ఒక కుర్రాడు: "ఏమీ ఉండవండి."

ఇన్స్పెక్టరు: "ఎందుకుండవు? నీకు లెక్కలు తెలియవన్న మాట."

కుర్రాడు: "నాకు లెక్కలు తెలియక పోవచ్చుగాని, మీకు గొర్రెల సంగతి తెలియదండి."

త్వరలో వస్తున్నది!



కె & కె
ప్రొడక్షన్సు వారి

# ఆకలి

(తెలుగు)

తంగం... ప్రేమ్‌నజీర్... తిక్కురిసి
ద్రౌపది నటించినది...



డైరెక్టర్:
మోహన్‌రావు

Release through

**THE VAUHINI PICTURES LIMITED,**

**MADRAS ★ VIJAYAWADA ★ GUNTAKAL.**

వ్రాసికొన్న వ్యవహారపత్రము. అందులోది వ్యవహార భాష.

"ఖగనాథుం డమరేంద్రు గెల్చి సుధ మున్
 గైకొన్న చందంబునన్
జగతీనాథుల జైద్యపక్ష చరులన్
 సాల్వాదులన్ గెల్చి భ
ద్రగుడై చక్రి వరించె భీష్మకసుతన్
 రాజీవగంధిన్ రమా
భగవత్యంశ భవన్ మహాగుణమణిన్
 బాలామణిన్ రుక్మిణిన్."

బమ్మెర పోతన్నగారు భాగవతంలో రుక్మిణీకల్యాణ కథలో వ్రాసిన యీపద్యం గ్రాంధికభాషలో ఉండడం చేత సులభంగా జనానికి అర్థం అగుటలేదని వాదించేవాళ్లు ఉన్నారు. అలాగయితే, పైన చెప్పబడిన పారీఖత్తులోని వ్యావహారికభాష పదిమందికీ సులభంగా అర్థం అవుతున్నదని వాదించగలమా? నిజం చెప్పాలంటే పోతన్నగారిది ఎంత గ్రాంధికభాషగా ఉన్నదో పారీఖత్తులో ఉన్న వ్యావహారిక భాష కూడా అంత గ్రాంధికభాషగా ఉంది. లేదా ఒక్కొక్క వ్యవహారానికి ఒక్కొక్క ప్రయోజనానికి ఒక్కొక్క భాష ఉపయోగించడం మంచిది గనుక ఆయా ప్రయోజనాలకు ఆయా భాషా ధోరణిని అనుసరించడం ప్రశస్తంగాను ప్రయోజనకరంగాను ఉంటుందని మన మొక సంప్రదాయ పద్ధతిని ఏర్పాటు చేసికోవడం మంచిది.

మహాస్రగ్ధరలో ఆశీర్వచన పద్యం వ్రాయడం బాగుంటుందా? కదన కుతూహల రాగంలో అప్పగింతల పాట పాడితే రక్తి కట్టుతుందా? అదేవిధంగా భావానికి తగిన భాష ఎట్లాగో, భావానికి తగిన రాగం ఉండడం మంచి సంప్రదాయం. అదొక మంచి కట్టుబాటు. అటువంటి నియమాలు సంగీతానికి విధిగా ఉండాలి. ఎందుచేతనంటే సంగీతం స్వరబద్ధంగా ఉంటేనే శ్రావ్యంగా ఉంటుంది. లయబద్ధంగా ఉంటేనే రంజింపజేస్తుంది. హృదయాన్ని రంజింపజేసేదిగాని, చేయవలసినదిగాని, ఏదైనప్పటికీ, నియమబద్ధంగా ఉండితీరాలి. నియమబద్ధమైన శాస్త్రజగత్తుకు మాత్రమే గాక, బాహ్యజగత్తుకు అంతటికీ యీ సూత్రం వర్తిస్తుంది. గ్రహాలు గతులు తప్పకుండా సంచరిస్తున్నాయి. అణువులు పరమాణువులు సహా నియమబద్ధంగా సంయోగ వియోగ సంశ్లేష విశ్లేషములు పొందుతూ లయబద్ధంగా నిర్ణీత గమనవేగాలతోను గమకాలతోను అనువర్తించడంవల్లనే అణుశక్తి ఎట్టిదో గ్రహించిన ఘనులమైనాము. కాని, సృష్టి నియమాలను అనేకం గ్రహించిన నేటి ఆధునిక నాగరిక మానవలోకం మాత్రము నియమం లేకుండా మాట నిలకడ లేకుండా ప్రవర్తించడంవల్లనే అపశ్రుతులు కన్పిస్తున్నాయి. "సుజలాం సుఫలాం మలయజ శీతలాం" అని పాడి కొనియాడిన ఈ "పాడిపంటల మహాలక్ష్మి"యైన ఈ "రత్నగర్భ"యైన రాజ్యంలో "అన్నమో రామచంద్రా!" అనే ఆర్తనాదాలు కూడా వినిపిస్తున్నాయి. "శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం"—శుభ్రమైన వెన్నెలతో పులకించిన చల్లనిరాత్రులుగల యీ రాజ్యంలో నెత్తిమీద గుడ్డ వేసికొని కాంభోజీ రాగంలో ప్రజలు ఏడ్చినట్లుంది. కాని, మానవజీవితం అంతా కొన్ని కర్మసూత్రాలకు కట్టుబడిఉంది. ఈ అపశ్రుతులు కూడా మన కర్మఫలమే. ఈ పండు వెన్నెలలో కాంభోజీ రాగంలో ఏడువడంకూడా నియమబద్ధంగా మన మనుభవింపవలసిన కర్మఫలమే గాని మరొకటి కాదు. జగత్తు అనేది నియమబద్ధం కాకపోతే నిలువనే నిలువదు.

"నియమం బెద్దియు లేక నిల్వగలదే
 నిర్భీతిగా లోకముల్?"

★

# ఆస్కార్‌వైల్డ్ చిత్రం

ఆస్కార్ వైల్డు నాటకం "*The importance of being earnest*" అనే కామెడీని ఆర్థర్ రాంక్ ప్రొడక్షన్సువారు టెక్నికలర్ చిత్రంగా తీశారు. ఇది ఇటీవల మద్రాసు వచ్చింది. దర్శకుడు ఆంథొనీ ఆస్క్విత్. ఈ చిత్రం చూసి మనవారు నేర్చుకోవలసిన దొకటున్నది. ఆస్కార్ వైల్డు నాటకంలోని ఒక్క ముక్కనుకూడా తీసివేయకుండా ఒక్క ముక్క కూడా కలపకుండా యథాతథంగా దర్శకుడు చిత్రీకరించాడు. ఈ నాటకం వైల్డు నాటకాల్లో ఉత్తమమైనది కాదు. సంఘటనలకంటె సంభాషణలకే ఎక్కువ ప్రాధాన్యం. ఆ సంభాషణలలో హాస్యం, వ్యంగ్యం, వేళాకోళం అన్నీ ఉంటాయి. ఇటువంటి నాటకాన్ని చిత్రంగాతీయటం చాల కష్టం. ఏ అమెరికావారో అయితే మూల నాటకాన్ని ఇష్టం వచ్చినట్లు మార్చి, ఇష్టం వచ్చినవి కల్పించి ఆస్కార్ వైల్డును ధ్వంసంచేసి వుండేవారు. బ్రిటిష్ వారు తీశారుకనక వైల్డుమీద భక్తిశ్రద్ధ యథాతథంగా చిత్రం తీశారు. ఈ తీయటంలో చాల నేర్పు కనబడుతుంది. చిత్రంలో కళ్లతో చూడవలసినదానికంటె చెవులతో వినదగినదే ఎక్కువ ఉన్నప్పటికి ప్రేక్షకులకు విసుగు కలగదు. నటీనటులందరూ వైల్డునాటకాలను నాటకరంగంమీద ప్రదర్శించటంలో ఆరితేరినవారే. వారినటన, సంభాషణలు వెలిబుచ్చే విధానం నాటకీయంగా ఉన్నప్పటికీ చిత్రం చూస్తూ చివరిదాకా ఆనందించగలము. ఇది చలనచిత్రంగా గొప్పది కాకపోవచ్చు గాని ఒక ప్రసిద్ధనాటకాన్ని ఏమాత్రమూ స్వంత పైత్యము కలపకుండా చలనచిత్రంగా తియ్యాలంటే ఒక చక్కని ఉదాహరణగా ఉపయోగపడుతుంది.

ప్రసిద్ధ నవలలను గాని, నాటకాలను, కావ్యాలనుగాని చిత్రంగా తియ్యటానికి కొంత ప్రత్యేక శ్రమ అవసరమవుతుంది. నవలకు గాని, నాటకానికి గాని, సినిమాకు గాని దేనికైనా కథావస్తువు ఒకటే. దానికి ట్రీట్‌మెంట్ ఇవ్వటంలో మాత్రం దేని టెక్నిక్ దానిదే. నవల మాటల్లో వర్ణించటంద్వారా సన్నివేశాలను, సంఘటనలను కల్పిస్తుంది. నాటకం సంభాషణలద్వారాను, రంగస్థలంమీద ఏం చెయ్యాలో సూచించటంద్వారాను కథ చెబుతుంది. ఈ పద్ధతులు సినిమాకు పనికిరావు. ప్రతి సంఘటనా, ప్రతి అంశమూ కళ్ళ ఎదట ప్రత్యక్షంగా చూపించాలి. అందుచేత ఒక నవలను చిత్రంగా నిర్మించాలంటే తెర మీద ప్రత్యక్షంగా చూపటానికి వీల్లేని అనేక వర్ణనలను తీసివెయ్యాల్సి ఉంటుంది.



పార్వతిని తప్ప ఇంకెవరినీ పెళ్ళిచేసుకోనని పట్టుబడుతున్న దేవదాసును వంశగౌరవం పేరుతో తండ్రి మందలిస్తున్నాడు.
వినోదావారి "దేవదాసు"లో తండ్రిగా రంగారావు, దేవదాసుగా నాగేశ్వరరావు.



పార్వతి మరొకర్ని వివాహం చేసుకుంది. దేవదాసు జీవితం శూన్యమైంది. నిస్పృహతో తాగుడు అలవాటు చేసుకున్నాడు.
"నాకోసమైనా తాగుడు మానలేవా" అని అడగటానికి పార్వతి వచ్చింది.
వినోదావారి "దేవదాసు"లో నాగేశ్వరరావు, సావిత్రి.

మానసికస్థితిని వ్యక్తం చెయ్యటానికి అనువైన అనేక కొత్త అంశాలను సృష్టించవలసి ఉంటుంది. వీటివల్ల తప్పనిసరిగా అసలు నవలకు, సినిమా కథకు తేడా వస్తుంది. సినిమా అవసరాలకు అనుగుణంగా నవలలోని కథకు సినిమాటిక్ ట్రీట్‌మెంటు ఇవ్వటం తప్పు కాదు. అయినప్పటికీ అసలు గ్రంథకర్తవీ అంశాన్ని మాటల ద్వారా వ్యక్తం చెయ్యటానికి ప్రయత్నించాడో ఆ అంశాన్ని మాత్రం సినిమాదర్శకుడు త్యజించటానికి వీల్లేదు. అలా త్యజిస్తే అసలు గ్రంథకర్తకు అన్యాయం చేసినట్లవుతుంది. సాధారణంగా వ్యాపారదృష్టిగల నిర్మాతలు బాక్సాఫీస్ కోసం ఎంతగొప్ప రచయిత నవలలోనైనా అర్థం లేని డాన్సులు, పాటలు ప్రేమసన్నివేశాలు పెట్టి అసలు నవల ప్రయోజనాన్ని ఖూనీ చెయ్యటం కద్దు.

ఆస్కార్ వైల్డు చిత్రంనుంచి నేర్చుకోవలసింది ఇదే. "*Importance of being Earnest*" లో ముఖ్యపాత్రవహించేది సంభాషణలు. వాటిని తీసేస్తే కథాలేదు, నాటకమూ లేదు, పాత్రలూ లేరు. ఇది గ్రహించే దర్శకుడు ప్రతిసంభాషణను అట్టేపెట్టి ఉంచాడు. ★

## సినిమా వార్తలు

కె ఎండ్ కె ప్రొడక్షన్సువారు తెలుగు, అరవం, మళయాళం భాషల్లో తీస్తున్న "తండ్రి—కొడుకు" అనే చిత్రం చాలవరకు పూర్తయింది. డిసెంబరులో విడుదల అవుతుందట. ఈచిత్రంలో బి.ఎస్.సరోజ, ప్రేమ్‌నజీర్, తిక్కురిసి, కొత్త నటి జయశ్రీ మొదలైనవారు నటిస్తున్నారు. తెలుగులో పాటలు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. దర్శకుడు ఎమ్. ఆర్. ఎస్. మణి. అలెప్పీలోని ఉదయా స్టూడియో లో నిర్మాణం జరుగుతోంది. కథావస్తువు సాంఘికమట. చిత్రంనిండా పాటలుంటాయట. * * *

రాజరాజేశ్వరీవారి "పేదరైతు" నవంబరు 14 వ తేదీన విడుదలకానున్నది.

మీర్జాపురం రాజాగారు నిర్మించిన "ప్రజాసేవ" అనే చిత్రం నవంబరు 7 వ తేదీన ఆంధ్రదేశమంతటా విడుదల అవుతోంది. డిస్ట్రిబ్యూటర్లు చక్రమియావారు. **

అశోక్‌కుమార్ తీయబోతున్న ఒక కొత్త చిత్రంలో ఒక్కపాటకూడా ఉండదట. ఈ చిత్రానికి బి.ఆర్. చోప్రా దర్శకుడు. ఈ చిత్రం పూర్తయితే ఇది పాటలు లేకుండా తీయబడిన మొదటి హిందీచిత్రం అవుతుంది. ★

తెరవండి పారిపోతుంది. (ఫాదరీ లోముఖంలోకి చూసి) ఓ! అదా! అవును. మీ అర్థం తెలిసింది. కాని పశ్చాత్తాపం నాకనవసరం.

ఫా: కోర్టులో విచారణ న్యాయంగా జరగలేదా?

డె: దురదృష్టానికి న్యాయాన్యాయాలేమిటి?

ఫా: కేవలం దురదృష్టమే కారణమా?

డె: నే నతన్ని కొట్టడం తప్పే. అది కోపప్రభావం; మానవుడి మూలదోషం. కాని ఆ మాత్రం దెబ్బకి ఆరు వారాల జైలుకంటె శిక్షపడదు. జనక ఇనపరాట ఉండడంవల్ల నాలుగేళ్ళు ఎక్కువ శిక్ష పడింది. పారిపోవడంలో తప్పులేదనే నా నమ్మకం.

ఫా: నీకు ఈవిషయంలో ఆత్మసంతృప్తి ఉంటే చాలు.

డె: మీరు చింతపడ నవసరం లేదులెండి. నే నెల్లాగూ మళ్లీ పట్టుబడిపోయే మాట నిజం.

ఫా: (చిరునవ్వుతో) నే నందుకు చింతించడం లేదు. ఇంత సాహసించిన వాడవ్ ఆత్మరక్షణకోసం ఇంకొకళ్ళ సహాయం నీ కక్కర్లేదింక. నాకే ఆత్మశాంతి నశించింది. ఏవేవో అనేక ఆలోచనలు వస్తున్నాయి. వీటి తాకిడికే కలవరపాటు కలుగుతోంది. నువ్వు సైన్యాన్ని నడిపినవాడివి. పదిమందితో ఎలా...

డె: అవునవును. మీరు మీ గ్రామస్థుల్ని నీతి నియమాల హద్దుల్లో నడుపుతుంటూ పోవాలి, అంతే కదూ?

ఫా: అవును. నువ్వు వెళ్ళిపోతావు. నే నేం చెయ్యాలి? నువ్విక్కడికి వొచ్చినట్లు చెప్పాలా? వాళ్ళ చాటుని నేను కూడా ప్రభుత్వశాసనాన్ని ధిక్కరించనా? లేక నే చేసిన పని చెప్పెయ్యాలా? చెప్పేస్తే ఇంక నా మాట మీద వాళ్లకి గౌరవం పోతుంది. ఇంక పాదరీగా ఉండి నే నేం చెయ్యగలను? అదీ నాచింత.

డె: ఓ. అలాగా, తెలిసింది. (ఉలిక్కిపడి) ఎవరో తలుపు గెంటుతున్నారు.

(ఫాదరీ కుడివైపు గుమ్మంవద్దకు వెడతాడు. డెనాంట్ లేచి నిలబడతాడు.)

ఫా: (ద్వారంవద్ద) ఎవరు వారు?

చర్చి నౌకరు గొంతుక: నేనండి, గంట కొట్టేవాణ్నండి.

ఫా: నే నిప్పుడు పనిలో వున్నాను థామస్. సాయంకాలంలోగా ఎవ్వరితోటీ మాట్లాడ్డానికి తీరిక లేదు నాకు.

(కాస్సేపు వింటాడు. నిశ్శబ్దం. గది మధ్యలోకి వస్తాడు.)

డె: (సన్నగా) భగవంతుడే నాపాలిట ఉన్నాడు ఫాదర్. ఇదెన్నడూ మరిచిపోలేను నా జీవితంలో. కాని మీకు వ్యథ కలిగించి నే నిక్కడుండలేను. వెళ్ళిపోతాను. అబ్బ! పావురం మాదిరిగా నాకూ రెక్కలుంటే ఎంత బాగుండును!

ఫా: ఆరున్నరకి చర్చిలో ప్రార్థన మొదలు, ఆట్టేమంది రారు లే. నువ్వు ఇక్కడే వుండు. పూర్తిగా విశ్రాంతి తీసుకో. ఇక్కడి కెవ్వరూ రారు.

డె: మీ తెగింపు మెచ్చుకోవాలి. కాని నేను వెళ్ళిపోతాను. నా అదృష్టం ఎలా వుందో చూస్తాను. అప్పుడే చీకటి పడుతోంది. లొంగిపోవాలని నాకు లేదు. పారిపోతాను. పట్టుబడితే బయటే పట్టుబడతాను. ఇక్కడొద్దు. నన్ను ఆశీర్వదించి పంపండి.

ఫా: (ఎటూ తోచక) ఏం చెయ్యాలో నాకు పాలుపోవడం లేదు. నేను నిన్ను ఆశీర్వదించగలవాణ్నా? ఆర్చి బిషప్ గారే దిగిరావాలి నిన్నాశీర్వదించడానికి.

(తలుపు దబదబ చప్పుడు)

డె: అరె! పట్టుబడిపోయా నింక. అయింది. (ఒక్క ఉదుటున వెళ్లి బీరువా ప్రక్క తగిలించిన నల్లని నిలువు గౌనులో దూరి దాక్కుంటాడు. ఫాదరీ ద్వారం సమీపిస్తాడు.)

ఫా: (తీక్షణ స్వరంతో) ఏమిటది?

పోలీసు గొంతుక. నేనండి పోలీసుని. ఒకసారి తలుపు తియ్యండి.

[ఫాదరీ ఇంక లాభం లేదన్నట్లు తలుపు తీసేస్తాడు. పోలీసు, రైతు, కార్మికులిద్దరూ, చర్చి నౌకరూ ప్రవేశిస్తారు.]

ఫా: సాయంకాలంవరకూ తీరిక లేదని చెప్పలేదూ థామస్! మళ్ళీ ఏమిటిదంతా.

థా: చిత్తం. కాని పోలీసాయన ఊరుకోలేదండి, ఇప్పుడిప్పుడే కూశానండి ఒక మనిసి ఇట్టా రాడం. అదేదో సూస్తానన్నాడండి. (చుట్టూ పరకాయించి చూస్తాడు.)

ఫా: (పోలీసుతో) ఏమిటోయ్ ఇదంతా?

పో: పరారైన ఖైదీ అండి. వాడికోసం వెతుకుతున్నామండి. దొరికినట్టే దొరికి తప్పించుకుంటున్నాడండి. ఈ రైతు చేతులో ఒకసారిపడి తప్పించుకున్నాడు. అయింట్లో కనపడి పారిపోయాడు. ఇప్పుడిల్లా ఈ దారిని వొచ్చాడని మే మందరం చూశామండి. చర్చిలో దూరినట్లు థామసే చూశాట్టండి. ఇక్కడ మీరు చాలసేపణ్నించి ఉన్నారాండి?

ఫా: గంట సేపణ్నించి ఉన్నాను.

పోలీసు: ఆ గుమ్మం లోపల గడియ వేసే వుంది. బయట మావాళ్లింకా ఉన్నారకోండి. చర్చిలో లేడని మీకు నమ్మకమేనాండి?

ఫా: (చర్చిహాలు గుమ్మంవేపుకి దారి తీస్తూ) చర్చి సోదా చెయ్యడానికి నీ కధికారముందో లేదో నాకు తెలియదు. అయినా నీ అంతట నువ్వే ఒకసారి చూసుకో. సద్దు మాత్రం చెయ్యవద్దు. (ద్వారంవద్ద నిలబడతాడు. థామస్ తప్ప అందరూ ద్వారం దాటి హాల్లోకి వెడతారు. ఫాదరీ థామస్ ని పిలుస్తాడు)

ఫా: నువ్వు కూడా వెళ్ళు థామస్. నే నిక్కడుంటాను.

(థామస్ గదిలోనే పరకాయించి చూస్తూ తప్పటడుగుల్తో హాలులోకి వెళ్ళిపోతాడు.)

ఫా: (అతి మెల్లిగా) ఊఁ. త్వరగా! వెళ్లిపో.

(కాని ఇంతలోనే రైతు గదిలోకి వస్తాడు. డెనాంట్ ఒకసారి ఇవతలకి వచ్చి మళ్లీ వెనక్కి వెళ్ళి దాక్కుంటాడు.)

ఫాదరీ: ఏం బ్రౌనిఁగ్?

రైతు: అక్కడ లేడండి అంతా కాలీ. బలే టక్కరిలెండి. అయినా సిక్కకుండా ఎక్కడికి బోతాడు గాని.

(రైతుఅనుమానంతో ఫాదరీ ముఖంలోకి చూస్తాడు.)

ఫా: (రాని నవ్వు తెచ్చిపెట్టుకుని) నీ చేతుల్లోంచే తప్పించుకు పారిపోయాడా?

రైతు: అవునండి. నక్కలాటోడు. ఇట్టే కనపడి ఇట్టే మాయమైనాడండి. అక్కడా నల్లగౌనుసాటు నేటండి ఉంది?

ఫా: నే చూస్తాలే.

(ఫాదరీ గౌనువద్దకు వెళ్లి అటూఇటూ చూస్తాడు. ఇంతలోకే హాల్లోంచి అందరూ వస్తారు.)

పో: అక్కడ లేడండి. థామస్, అనవసరంగా వెతికించావ్. మమ్మల్ని గాడిదల్ని చేశావురా.

థా: (తడబడుతున్న మాటలతో) సూశానండి, మీతోడు.

ఫా: (గడియారం వంక చూస్తూ) థామస్! ప్రార్థనకి వేళ అయింది. వెళ్లి గంటకొట్టు. (పోలీసుతో) ఇంక మీరు

వెళ్ళాలండి. మా పనికి అటంకం. ప్రార్థనకి ఉండాలనుకుంటే కాదనను.

(పోలీసు ముఖం కందగడ్డ వుతుంది. ముందు ద్వారం తలుపు తెరుస్తాడు.

పో: (తనవాళ్ళతో) రండి పోదామింక. (ఫాదరీతో) క్షమించండి, మాడ్యూటీ కోసం ఈ ప్రయాసంతా.

ఫాదరీ: ఫరవాలేదు.

రైతు: (అకస్మాత్తుగా) ఆగండి, ఫాదర్! నిజం చెప్పండి, నిజంగా మీరెవరినీ చూడనేలేదా?

ఫా: (చేతులు కట్టుకుని గంభీరంగా) ఏమిటి నువ్వనుకుంటున్నది?

రైతు: [illegible] చెప్పండి, తప్పించుకున్న రైతుని మీరు చూళ్ళేదా?

(క్షణంసేపు అంతా మౌనంగా ఉంటారు)

ఫా: నేను...

(సెర్జెంట్ గోను తొలగించుకుని వారి మధ్యకు వస్తాడు)

డే: ఆయన చూళ్ళేదు. (ఫాదరీవంక తిరిగి) నన్ను క్షమించండి ఇక్కడికివచ్చి మీకు తెలియకుండా దాక్కున్నందుకు. ఇందాకట్నుంచీ ఇక్కడే దాక్కున్నాను. (చేతులెత్తి పోలీసుతో) నేను పట్టుబడి పోతున్నాను. సంకెళ్లు తగిలించండి.

రైతు: ఓరి నక్కా! బతే! ఎంత తిప్ప లెట్టావ్‌రా!

ఫా: (అగలిగ్గా) ఇక్; ఈ సేవాలయంలో అలా మాట్లాడానికి వీల్లేదు. వెళ్ళండి అవతలికి. మిమ్మల్నిచూస్తే క్రీస్తు దేవుడు సిగ్గుతో శిరస్సు వంచుకుంటాడు. పొండవతలికి.

(ఫాదరీ కోపానికి అందరూ తెల్లబోతారు. మెల్లిమెల్లిగా అందరూ గుమ్మం దాటి వెళ్ళిపోతారు. గది మధ్యలో ఫాదరీ, పోలీసు, సెర్జెంట్ మిగుల్తారు)

డే: (ఫాదరీతో) నన్ను క్షమించండి. ఇక్కడికి రావడం నాది పెద్దదోషం. నేను మీకు అన్యాయం చేశాను.

ఫా: లేదు లేదు. నువ్వు అన్యాయమేమీ చెయ్యలేదు.

డే: కాని ఈ ఉచ్చునించి తప్పించుకోలేం కదా! నిజాయితీ, మర్యాద, పెద్దమనిషితనం వంటివన్నీ భ్రమలు; ఉచ్చులు. ఆత్మవంచనకు లోబడకుండా తప్పించుకోవడం ఎవరికీ వీల్లేదు.

ఫా: అవును. నిజం చెప్పావు. నిన్ను భగవంతుడే రక్షిస్తాడు వెళ్లు.

(పోలీసు, సెర్జెంట్ గుమ్మం దాటి వెళ్ళిపోతారు. ఫాదరీ ఆలోచనలో మునిగి ఉంటారు. చర్చి గంట వినబడుతుండగా తెర పడుతుంది.)

[అయిపోయింది]

# సంసారమ్

(5వ పేజీ తరువాయి)

ఎన్నో పోకడలు, ఎన్నో చిలవలు పలవలు - అన్నీ వుంటాయి. సంసారంలో గృహయజమాని, ఆయన భార్య, ఆయన పిల్లలు, ఆయన తోబుట్టువులు, ఆయన తలిదండ్రులు, ఆయన తాతముత్తాతలు, ఆయన మనుములు, మునిమనుములు - గొడ్డూ గోదా, పిల్లీ మేకా, పనిమనుషులు యింతమందీ -, యింకో యింతమందీ వుంటారు. వీరందరిలో వొక్కొక్కరిదీ వొక్కొక్క రామాయణమంతటి చరిత్ర! వీటితోబాటు వొక వ్యక్తికీ యింకొక వ్యక్తికీ వుండే సంబంధాలూ అవీ తీసుకుంటే యింక యెన్ని ఉపాఖ్యానాలు తయారౌతవో చెప్పలేము.

సంసారమనేది వొక నాటితో తెమిలేది కాదు. 'ఒక ఘట్టంతోనే చెప్పేసుకున్నాం' అనుకోవడానికి వీల్లేదు. చిలికిన కొద్దీ — తరిచిన కొద్దీ యేదో వొకటి వస్తూనే వుంటుంది; బయటపడుతూనే వుంటుంది.

అంచేత యీ నాగానికి యీ ఉపోద్ఘాతంతో ప్రారంభించి వారం వారం సంసారంగురించి - దానిలోని యేకోవొక అంశాన్నిగురించి ముచ్చటిస్తూ వద్దాం. ★

#  జంతుకోటిలో మానవలక్షణాలు 

(34-వ పేజీ తరువాయి)

కటకటాలలో ఏదో ఒకటి అడ్డు పెట్టటం. ఇలా చేసినందువల్ల, తిండికి ఆశపడ్డ ఆ జంతువు దానిని పొందాలంటే సూటిగా పోవటానికి వృథాగా ప్రయత్నించకుండా, ఎంతమేర అయితే ఆ యినపజల్లెడ అడ్డంగా వుంటుందో అంత దూరమూ, అంటే ఆ పదిగజాలో పదిహేను గజాలో యినపజల్లెడ ప్రక్కగా పోయి అటునుంచి తిరిగి యివతలకు రావచ్చు. అలా చేస్తే సునాయాసంగా కళ్ళయెదుట కనిపించిన ఆ పదార్థాన్ని పొందవచ్చు. నాలుగేళ్ళ పసిపాపను యిలాంటి పరీక్షకు గురిచేస్తే ఎంతమాత్రమూ కలవరపడకుండా యిట్టే ఆ అడ్డు దాటి యివతలకు వచ్చి తనకు కావలసిన ఆ బిస్కట్టు ముక్కనో, బంతినో చేత్తో పట్టేసుకొంటుంది. జంతువులుమాత్రం అంత తేలిగ్గా యీ విషయాన్ని తెలుసుకోలేవు. వాటి అన్నిటిలోకి కుక్క ఒక్కటి మాత్రం మిగిలినవాటికంటే చప్పున ఈ సూత్రాన్ని కనిపెట్టగలిగింది.





ఇలాంటిదే చిన్న గమత్తు చేయవచ్చు. ఏదైనా ఒక జంతువును గుంజకు కట్టేశామనుకోండి. దానికి ఆకట్టుతాడు మెడలో వుండగా కూడా బాగా అందేటంత దూరంలోనే దానికి కావాలసిన తిండి ఏదో పెట్టి, ఆ తాడును మరొక గుంజకు రెండు చుట్లుచుట్టి ఆ వస్తువు అందకుండా చేశామనుకోండి. ఆ జంతువు గనుక కుక్క అయ్యేట్లయితే, అది ఎంతోసేపు ఆతాడు గొంతుకు బిగుసుకు పోయేట్లుగా తెగ గుంజుకొని గుంజుకొని నానా తంటాలు పడి కానీ, ఆ గుంజచుట్టూ రెండుసార్లు తిరిగితే ఆ బిగుతు తగ్గుతుందని గ్రహించలేదు. ఒక కోతిని యిలా చేస్తే, అది ఒక అర్ధ నిముషం సేపు అంతా కలియచూసి, మాట్లాడకుండా పోయి రెండో గుంజకు తగిలించిన చుట్లను చేత్తో విప్పేసి వూరుకుండట.

యేల్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్ ఫ్రాంక్ జీబ్ అనే శాస్త్రజ్ఞుడు 'ఆక్టోపస్' అనే ఎనిమిదికాళ్లు గల సముద్రపు జంతువుతో ఒక పరిశోధన చేశాడు. ఆ జంతువుకి రొయ్యలంటే మహా యిష్టం. అందుకని కొన్ని రొయ్యలను పట్టుకొచ్చి దానికి కనిపించేట్లుగా ఒకచోట పెట్టి దానికీ వాటికీ మధ్యను ఒక పెద్ద గాజు పలక అడ్డంగా పెట్టాడట. నిజానికి ఆ ఆక్టోపస్ కొంచెం అవతలకి జరిగితేచాలు, ఆరొయ్యి దాని చేతిలో చిక్కిపోతుంది. కానీ అది వున్నచోటినుంచీ ససేమిరా కదలకుండా అక్కడే వుండే ఆ ఎనిమిది కాళ్లూ బార జాపి ఎంతోసేపు గింజుకొన్నదే కానీ, ఆ కాస్త అటు జరుగుదామని దానికి ఎంతకీ తోచనేలేదట. తను వున్న చోటినుంచి ఏమాత్రం కదలినా ఆ రొయ్యి ఎక్కడ కనిపించకుండా పోతుందోనని దానికి ఒకే దిగులట!

ఏదైనా సమస్య ఎదురైనప్పుడు ఎంతసేపూ కంటికి కనుపించే ఆ సూటియైన దోవను పట్టుకు పెనుగులాడడమే కానీ, కాస్త ఆ ధోరణి తప్పించి ఆలోచిస్తే ఎంతటి సమస్యనైనా యిట్టే విడదీసుకోవచ్చుననే విషయం మనుష్యులలో మాత్రం ఎంతమందికి తెలుసు! అంతెందుకు? మనం కానీ, మన పూర్వులు కానీ మునుపెన్నడూ ఎదుర్కొనని ఒక చిన్న సమస్యను మనం ఎదురుకోవలసివచ్చిందనుకోండి. అలాంటప్పుడు మనలో ఎంతమంది ఆ సమస్యను ఎలా విడగొట్టాలో ఆలోచించలేక గుడ్లు వెళ్లబెట్టుతారో మనం వేరే లెక్కచేసి చూడనక్కరలేదు.

(ఇంకా వుంది)



(25-వ పేజీ తరువాయి)

పూటలు తిని, చేతిలో దమ్మిడీలేక కాలంగడిపేవాడిని. ఒకప్రక్క ఆకలితో, మరియొక ప్రక్క మా మేనమామలు నామీదచేసే నేరారోపణల ప్రచారముల జటిల సమస్యలతో పుస్తకము తెరిస్తే చదువు సాగేదికాదు. ఇంకొక ప్రక్క ఆ యింటిలోని పిల్లల గోల నా చదువును అర్థంకాకుండా చేసేది. ఈ సమస్యలతో నా మనస్సు చెదరి, మహ చికాకుగా వుండేది బుర్ర.

విషయమంతా మా అత్తయ్యనీని, తనవల్లగదా యీ రాద్ధాంతమంతా జరిగిందని తనలోతాను తర్కించి, కృశించింది. తర్వాత నాతో నిక్కచ్చిగా చెప్పింది "మాయింటి కికమీద రావద్దని."

నేను ఆమెమాట లక్ష్యంచెయ్యక ఖాళీ ఉన్నప్పుడల్లా వెళ్లి మాట్లాడుతుండేవాడిని.

మా మేనమామ కోపం పట్టలేక, నాతో చెప్ప ధైర్యంలేక, యిరుగుపొరుగు వాళ్లతో, కనుపించినవాడికల్లా చెప్పటం మొదలుపెట్టాడు. నాకు తెలిసినవాళ్లు, కనుపించినపుడల్లా నన్నడుగుతుండేవారు. నాకు మరింత కోపము హెచ్చింది. బుర్ర అచ్చగా యీ సమస్యలమీదే పనిచేసేది. ఎవరితో ఏవిధముగా కల్పించి చెప్పతున్నాడో కనిపెట్టాలని నిశ్చయించుకొన్నాను. నా బుర్రలో యీ సమస్యలే తిరుగుతుండేవి. మా మేనమామ ఎవరితో మాట్లాడినా జాగ్రత్తగా వినేవాడిని. కాని అడిగేవాడిని కాను. సమయం వచ్చినప్పుడు అన్నీ అడుగుదామనుకున్నాను. వాళ్ళతో మాట్లాడవలెనంటేనే అసహ్యమేసేది. నేను యింట్లో లేనప్పుడు నన్నుగూర్చి బాగా వల్లించుకొనేవారు. మా అత్తయ్యను నూటీ పోటీమాటలని యేడ్పించేవారు. ఆమెతో యేదోవిధంగా పోట్లాడేవారు. నేను యింటికి వచ్చేటప్పటికి వానకురిసి వెలసినట్లయ్యేది. ఈవిధంగా గడిపాను మొదటిసంవత్సరం.

* * * *

ఇక రెండోసంవత్సరము నేను మళ్లీ అక్కడ వుండుట తప్పలేదు. నేను యిక అందరితో మాట్లాడటము తగ్గించాను. అవసరమైతేతప్ప నేను మా మేనమామ మాట్లాడుకునేవారము కాము. ఈ సంవత్సరము మా అమ్మమ్మ ప్రముఖపాత్ర వహించినది నేను యెక్కడకు వెళ్లితే అక్కడకు వచ్చేది. నేను యెవరితోనైనా మాట్లాడుతుంటే, చాటుగా వినేది. నేను కాలేజీకి వెళ్లితే, మా అత్తయ్యగారింట్లో వున్నానని అనుకొని, యేదో నెపముతో వాళ్లింటికి వెళ్లి తనిఖీచేసి లేనని నిర్ధారణ చేసుకొనేది. ఇంత అనుమానముగల యింట్లో ఒకరిమీద నొకరికి విశ్వాసములేక కాలము గడుపుతున్నాను. మేమంతా పడుకొనిన తర్వాత, మా అమ్మమ్మ నిద్రబోతున్నట్లు నటించి, మధ్య మధ్య కళ్లెత్తి నన్ను కనిపెట్టుతూండేది. ఈ విషయం ఒకరోజున నేను ఎక్కువసేపు చదువుతూ కనిపెట్టాను. మా మేనమామలను మరింత యేడ్పించాలని, ఎప్పుడైనా తీరికయినపుడు, వాళ్లు చూస్తుండగానే, మా అత్తయ్యగారింటికి వెళ్లి మాట్లాడుతూండేవాడిని. వాళ్లు యేదో పనుందని పిలిచినా వచ్చేవాడినికాను. ఇక యేవిధంగా యేడ్పించాలో ఆలోచించుతూండేవాడిని. వాళ్ళ ప్రచారం మరింత యెక్కువైంది. నాకు చదువుమీద ఆసక్తి తగ్గింది. ఈ సమస్యలతో నా బుర్ర నిండినది. చదువుకు నా బుర్రలో స్థానంలేకపోయింది. మా అత్తయ్య మనోవ్యథ మరింతయింది ఆమె ఆహారముకూడ సరిగా తీసుకొనేదికాదు. ఆమెకు యీ సమస్యలతో మనస్సు చెడింది. ఆమె ముఖగంభీరత తగ్గింది అధైర్యము యెక్కువైంది. నాతో మాట్లాడాలంటే గుండెలుండేవికావు. నిద్రబోత్తుగా పోయేదికాదు. కళ్ళలో రక్తాలు చిమ్ముతుండేవి. కాని యీవిధంగా యింతమంది బాధపడుటకు కారకులెవరు? అని తరచు తర్కించుకొనేవాడిని.

మాయింట్లో అందరి భోజనాలయినపాక దీపము రాదు నా దగ్గరకు. అప్పుడు పుస్తకములు ముందు వేసుకొని యేవేవో ఆలోచించేవాడిని. ఈ విధంగా గడిపాను నా రెండవసంవత్సరము కాలేజీలో.

పరీక్షలైనవి. కాసు వస్తుందని ఆశించారు మా వూరిపెద్దలు పాపం! లోవనికీ తెలుసు నా మనోవ్యథ. నా మూలాన మరోవ్యక్తిని (అత్తయ్యను) దుఃఖాంబుధిలో ముంచాను. తీరని బాధను కల్పించాను మా మేనమాల బుద్ధి తెలుసుకోక ముందు జేరి. గృహచ్ఛిద్రాలు తెలుసుకోనవసరములేదు లోకానికి. ఫలితాలువచ్చినవి. తెలుగులోనా త్రితం ప్యాసయ్యాను. అందరూ నా ఫలితాన్ని చూచి ముక్కుమీద వ్రేలువేసుకొన్నారు. తప్పావని లోకమంతా గోలచేసింది. ఇందులో ఎవరిది తప్పు?

★

# ప్రశ్నలు..సమాధానాలు

కె. సత్యనారాయణ—బళ్లారి.

రాజాజీగారు సినిమాలు మాత్రము చూడకండి అన్నారు. దీనికి మీ ఉద్దేశమేమిటండి?

—ఎవరెలా ఉద్దేశపడినా ప్రజలు సినిమాలు చూడటం ఒక్కనాటికీ మానరు.

* * *

శ్రీమతి ఆర్. లక్ష్మి—గుంటూరు.

కొందరు భార్యాభర్తలు ప్రేమగా ఉంటే చిలకా, గోరింకలలాగున ఉన్నారమ్మ అంటారు. చిలుక జాతి, గోరింక జాతి వేర్వేరుకదా? అలా అనుటకు కారణ మేమిటి?

—చిలక జాతిలోని దంపతులున్ను, గోరింక జాతిలోని దంపతులున్ను చాలా అన్యోన్యంగా ఉంటాయి. పక్షి జోడులో ఒకటి చనిపోతే ఇంకొక కొత్త పక్షితో జోడు కలియదు. అందుచేత చిలుకల వలెను, గోరింకలవలెను అన్యోన్యానురాగంతో ఉన్నారని సామ్యం చెప్పుచున్నాము.

* * *

అక్కల శాయికుమారి—కొండపల్లి.

ఎంతోమంది ఆశతో డబ్బు ఖర్చు చేసి మీ సచిత్రవారపత్రికకు ప్రశ్నలు పంపుతుంటారు. కాని మీరు అవి అన్నీ ప్రచురించరు. ఇట్లా చేస్తే మోసమంటాను. మీరేమంటారు?

—మాకు వచ్చే ప్రశ్నలన్నిటికీ సమాధానాలివ్వాలంటే ప్రతివారం అనుబంధ సంచికలు ప్రచురిస్తేగాని సాధ్యం కాదు.

* * *

శ్రీ బి. కే. రెడ్డి—వూటుకూరు నెల్లూరు జిల్లా.

పెద్దబాలశిక్ష మొట్టమొదట కూర్చి వ్రాసిన వారెవరో తెలుపగలరా?

—చెన్నపురి హిందూ విద్యామహాసభయందు సంస్కృత పండితులైన శ్రీ పుదూరి సీతారామశాస్త్రిగారు మొదట పెద్దబాలశిక్షను రచించారు.

* * *

గాజులపల్లి సత్యం—కడప.

ఒక భాషలో క్రొత్తదారులు తొక్కి, బ్రహ్మాండంగా ఆర్థిక విజయం సంపాదించిన ఒక చిత్రం, వేరే భాషలోకి డబ్ చేసినపుడు కానీ, అనుకరించినపుడు కానీ దెబ్బ తినటానికి కారణ మేమిటి?

—తెలివిగా అనుకరించకపోవటంవల్ల గానీ, సరిగా డబ్ చేయకపోవటంవల్ల గానీ దెబ్బ తినవచ్చు.

ఏమండి! సినిమా చిత్రాలు ప్రజల్లో అవినీతిని ప్రోత్సహిస్తున్నాయని అందరూ అనేవారే కానీ, మరి చిత్రాలెలా వుండాలో ఖచ్చితంగా చెప్పేవారొకరూ లేకపోవటానికి కారణం?

—చెప్పినా వినేవారు లేకపోవటమే కారణం.

* * *

శ్రీ క్రొవ్విడి అచ్యుతరామయ్యగారు —ఆకివీడు.

త్యాగరాజుగారి కృతులకు వారిచే నిర్ణయింపబడిన రాగములను మార్చుటకు వీలులేదందురు. ఆ కృతులకు ఆయా రాగములకు గల అవినాభావ సంబంధము సెలవిస్తారా?

—కృతికీ రాగానికీ ఉన్నటువంటి సంబంధం అవినాభావ సంబంధం అని పై ప్రశ్నలోనే వివరింపబడింది. ఏ రాగంలో ఏ రసభరితమైన భావం అత్యంత సహజంగా లీనం కాగలదో, ఆ విధంగా ఆ రాగానికి అత్యంత సమాశ్రితమైన భావం, రసం గల సాహిత్యం ఆయన కృతులలో పలికింది. ఆయన త్రికరణశుద్ధి గల భక్తుడు గనుక రాగం, భావం, రసం సమస్థాయిలో పలికినవి.

* * *

నాదెళ్ళ కృష్ణారావు—పమిడిముక్కల.

సినిమా కళకు చిత్రకళకు భేదమేమి?

—స్థూలంగా చెప్పాలంటే సినిమాలో బొమ్మలు కదులుతాయి; చిత్రకళలో బొమ్మలు కదలవు.

* * *

పుణ్యమూర్తుల కొండలరావు—పెనికేరు.

"గొప్ప కళాకారుడు గొప్ప కవి కాలేడన్న" బెర్నార్డుషా మాటలు "శ్రీ అడివి బాపిరాజు" గారిపట్ల ఎంతవరకు వర్తిస్తాయి?

—ఆ ముక్క బెర్నార్డుషా అన్నాడో లేదో తెలియదు. చిత్రకళ, కవిత్వం రెంటిలోనూ గొప్పవాళ్లు లేకపోలేదు. ఆంగ్లేయుడు విలియం బ్లేక్ కవి, చిత్రకారుడు కూడాను. అయితే ఒకొక్కరు ఒకొక్క కళమీదే ఎక్కువ దృష్టి కేంద్రీకరిస్తారు. బాపిరాజుగారు తమ జీవితకాలంలో చిత్రరచనపైకంటే సాహిత్యరచనపైనే ఎక్కువ దృష్టి కేంద్రీకరించారు.

* * *

పేటేటి నారాయణ లోకమాన్య—చీరాల.

ఉత్తమదర్శకుడు, ఉత్తమరచయితగా కూడ ఐవుంటాడా?

—ఎందుకు కాకూడదు? చార్లీచాప్లిన్ తన చిత్రాలకు తనే స్క్రిప్టు, డైరెక్షను సమకూర్చుకుంటాడు.

* * *

శ్రీ చుండూరు రామశాస్త్రిలుగారు—తెనాలి.

మన అప్రలు ఎవరైనా తలుస్తుంటే ఎక్కిళ్లు వస్తాయని పెద్దలు అంటారు. మీ అభిప్రాయం ఏమిటి?

—ఎక్కిళ్లు వచ్చినప్పుడు పెద్దలు తల్చుకుంటున్నారని కొంతమంది అంటారు. భోజనం చేసేటప్పుడు ఆహారపదార్థంగాని నీళ్లుగాని నోటిమార్గంలోనుంచి తప్పి ముక్కుమార్గంలోకి వచ్చి పులక మారినప్పుడు ఎవరో అప్రలు తల్చుకుంటున్నారని మరికొందరు అంటారు. ఈవిధంగా ఎవరి విషయంలోనైనా కాకతాళీయంగా జరిగి ఉండవచ్చు. ఈ విషయం మనశాస్త్రాలలో ఎక్కడా చెప్పబడలేదు. కనుక అది అశాస్త్రీయమైన నమ్మకము. మనమే అప్రలను తలుచుకొంటూ పరధ్యానంగా భోంచేస్తే అట్టివి సంభవించవచ్చు.

* * *



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras.

ప తంత్రం

# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహామూర్తి



"దేవతలంతటి వాళ్ళే చిలుకకు నొసటి రాతనూ తప్పించుటలో ఓడిపోవగా, మనకా సాధ్యం? నన్నా పాముకె ముడిపెట్టండి!"



ఈ విధముగ ఆకన్యారత్నం పామునే వివాహమాడినది. భర్తను భక్తిలో పూజిస్తూ అట్లే కాలం గడిపేది

ఒకరోజున నడిరాతిరి వేళా బుట్ట నుండి ఆ సర్పం వచ్చి సర్ప శరీరం అటనే వదిలి అందమైన ఒక యువకుని రూపం ధరించి భార్యను లేపింది



"భయపడకుము నేనే నీ భర్తను! ఋజువే కోరితే యిదిగో మళ్ళీ పాము శరీరం ధరించగలను."



అంటూనే ఆ యువకుడు పాముగ మారిపోవటము చూచిన భార్యా ఎంతో అబ్బుర పడ్డాది



ఈ రీతిగ ప్రతిరోజూ యువకుడు పాము శరీరం నుండి వచ్చుటను గమనించాడా యువకుని తండ్రి

ఒక దినమున నిశ్శబ్దముగా తండ్రి పోయి ఆపాము దేహమును చల్లగ దహనం చేశాడు.



పాము శరీరం కాలిపోవగా వదలికి చక్కని యువకుడు భర్తగ మిగులుట చూచి బంధువులంతా ఎంతో సంతోషించారు



"అట్లాగే ... రాజా! మనమూ స్వాములవారి ... దేహం ... దివ్య శరీరం ..."



మంద బుద్ధియగు రాజాగారూ "వహ్వా వహ్వా" అన్నారు మంత్రి వెంటనే భటులను పిలిచి స్వాములారు గల్ల ఆగదినీ భస్మీభూతం చేయించాడు



రాజుగార్కి తన బుట్టిలా వెళ్ళుగ వచ్చిన కపట స్వాముల వారే దుష్కరకానికి లోనయ్యాడు!



కరటకుడు దమనకునితో "అందుకనే ఓ దమనకుడా! నీ- వంటి కుబుద్ధులమూలంగా మా- కందరికీ తలవంపులు కలుగును! - పూర్వం యిట్టే ఒక వ్యక్తి - తెలివితేటలను చూపగోరి తన - తండ్రిని చంపుట ఎరుగుదువా?"



Rgd No M 4479 Andhra Patrika Illustrated Weekly